శ్రీయై నమః

# హత్యాపేటిక

(డిటెక్టివ్ నవల)


గ్రంథకర్త.

సహస్రావధాన ఫణీంద్ర, సహస్రావధాన వాచస్పతి,
సహస్రావధాన చతురానన, సహస్రావధాన
పంచాననా ద్యనేకబిరుదాంకిత
పంచ సహస్రావధాని

ఉంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి






ప్రకాశకులు:

కొండా శంకరయ్య

పుస్తకవ్యాపారులు,
సికింద్రాబాద్, హైద్రాబాద్ & వరంగల్.

1954


 [వెల ఐ. జి. 1—0—0

ప్రతులు 1000

ప్రథమ ముద్రణము

1954



ప్రీమియర్ పవర్ ప్రెస్

గంజిబజారు

సికింద్రాబాదు

# హెచ్చరిక

# విషయసూచిక.

# హత్యాపేటిక

## 1. విహారాభిలాష

ఒకనాఁటియుదయమున హేలావతి స్వస్థానమగు భీమ రాజనగరమునగల నిజనివాసమునఁ దనప్రియవల్లభుఁడగు, మహావీరునితో సరససల్లాపము లాడుచుండెను. అప్పుడు వారు శయనమందిరములో నుండిరి. మందిరమధ్యమున నొక ఎత్తైన పెద్దబల్లయుండెను. దానిపై వివిధవార్తాపత్రికలును, మాసపత్రికలును, వారపత్రికలును నలుప్రక్కల వ్యాపించి యుండెను. బల్లచుట్టును సుఖాసనము లమర్పబడియుండెను. పైభాగమున గప్పునుండి విద్యుద్దీపముల యద్దపుబుంగలు వ్రేలాడుచుండెను. నలుప్రక్కల గోడపై నాంధ్రవీరుల చిత్రపటములు దగిలించబడియుండెను. రెండుప్రక్కల విద్యుచ్ఛక్తి ప్రేరితములైన వీవనచక్రము లమర్చబడియుండెను. హేలావతియు మహావీరుడును చదువుబల్లప్రక్కలనున్న యాసనములపై ఒకరికెదురుగ నొక్కరుకూర్చుండి ముసిముసినగవులు నవ్వుచు, చంచలేక్షణములతో నొండొరుల వీక్షించుకొనుచు, వార్తాపత్రికలలోని సంగతులను, సాశ్చర్యముగ దర్శించుచుండిరి. గోడలకిటికీలలోనుండి విసరు పొలగాడ్పులకు యువతీమణి ముంగురులల్లాడుచుండెను. వలిదపయ్యెద అప్పుడప్పుడు గాడ్పునఁబ్రవహింపఁ జిఱునవ్వు మోమున మొలకలెత్తి నల్లభునితో నిట్లుసంభాషించెను.

"ప్రియా! మనము రాజకీయనిర్బంధితులవలె నీనాలుగు గోడలనడుమ బొమ్మలజూచుకొనుచు గూర్చుండుట మీకుత్సాహకరముగా నున్నదా? ఒక్కనాడైన లోకమున గల మనోరంజకములగు తావులనుజూచి పరిజ్ఞానము నార్జించుచు నానందించుట యుచితముగాదా? మనమిరువురమును విహారార్థ స్థానములయందు జోడుగవిహరించుచు ప్రసంగములు చేయుట నాకోకయభిలాషయై యున్నది. ఏమందురు?"

"ఎచ్చటికిబోవలయునని నీయభిప్రాయము?"

"ఇచ్చటికి పండ్రెండుమైళ్ళదూరములో, ప్రజావిహార సౌఖ్యమునకై ప్రభుత్వమువారేర్పాటుచేసిన పూదోటయును, దానిలో భూగర్భమున నిర్మాణముచేయబడిన చీకటిభవనమును జూచిరావలయునని నాయాశయము."

"నీకెన్నియో యభిలాషలుండవచ్చును. వానిలోనిది యొకటి. అట్టికోరికలు నెరవేర్చుటకు నవకాశము గావలయునుగదా?"

"ఇప్పుడు మనమింటియొద్ద నుండవలసిన నిర్బంధ విషయమేమున్నది?"

"అన్నియుదెలిసి తెలియనివానివలెం బ్రసంగించుట నీకుసహజగుణము. దేశమందంతటను బందిపోట్లు చెలరేగి యున్నవి. ఎందఱినో బందిపోటుదొంగలను బట్టుకొని పరిశోధన శాఖాధికారి మనోహరరావు నీవుచెప్పిన చీకటి గృహములోనే బంధించినట్లు వినియున్నాము. దొంగలు చెలరేగి కొంపలునిలువున దోచుచున్న సమయములో, మనము ఇల్లువిడిచిపోవుట యెంతహానికరమో విచారింపుము."

"ఇంటిరక్షణ మనతో నేఉన్నదావేమి? ప్రభాకరరావు ఇల్లుచూచుకొనలేడా? తండ్రితరువాత కుమారుడు గృహ రక్షణకు బాధ్యుడుకాడా? అదిగాక మనమెంతదూరము పోవుచున్నాము. ఎన్నాళ్లుతిరుగగలము. రేపు ఒక్కరోజు ఉండినచో మఱునాడు ఉదయమున జామున్రౌద్దెక్కకముందు ఇంటికిఁ జేరుకొనగలము. ధైర్యముచేయుడు."

"సరే! నీయిష్టము. ప్రభాకరరావునుబిలచి రేపు ఒక్కరోజు ఎక్కడికివెళ్ళక యింటివద్దనేఉండుమని చెప్పుము."

వల్లభుని యంగీకారముకాగానే, హేలావతి యత్యంతా మోద భరితురాలయ్యెను. బిరబిరలోనికిబోయి, ప్రభాకరుని గిలిచి "నాయనా! మీతండ్రియు నేనును ప్రజారామమునకు బోవుచున్నాము. అక్కడి చీకటియింటివింతలను జూచి రాగలము. రేపటిదినము మేమక్కడనేయుండి ప్రేక్షకుల వసతిగృహమునసే భోజనము చేయుదుము. అవకాశము కలిగినచో రేపుసాయంకాలమునకే రాగలము. అంతవఱకు నీవింటికడనేయుండి జాగరూకతతో గృహారక్షణము సేయు చుండుము. శీఘ్రముగ మన మోటారును సిద్ధపఱుపుము." అని చెప్పెను. ప్రభాకరరావు అందులకుసమ్మతించి, మంచిది అట్లే యొనరించెదననిపల్కి యింటిలోనికిబోయెను హేలావతియు లోనికిఁబోయి, నిశ్చితప్రయాణమునకు అవసరములయిన, ప్రధానపదార్థములను సిద్ధముచేసెను. సంసారనిర్వాహణ బాధ్యతగల మహావీరున కీప్రయాణమున నంతయుత్సాహము లేకుండినను, హేలావతియభిలాష దీర్చుటకైనను సమ్మతింప వలసివచ్చెను. అతడును నల్లనల్లన నడుగులిడుచు యింటిలోనికి

బోయెను. వారెల్లరును నెప్పటియట్ల మజ్జనాహారాది కార్య క్రమమును బూర్తిచేసికొని, కొంతతడవు విశ్రాంతి దీసికొనిన పిమ్మట, మోటారు సిద్ధపఱుపబడెను. హేలావతియు మహా వీరుడును యంత్రశకటము నెక్కి, చీకటిగృహముగల ప్రజా రామమునకుఁ బ్రయాణముచేసిరి.

---

## 2. మనోనిశ్చయము బలము.

"భీముడూ! ఏమితీసుకొనివచ్చినావురా?"

"బలేదెబ్బ కొట్టాములే."

"పదివేలకుంటుందా"

"అయేలేమిటో నాకు దెలియదు. తట్టెడు బంగారం ఉన్నది. పెట్టెడు రూపాయిలుఉన్నాయి"

"బలేయేటు. పదివేలకు తక్కువగాఉండదు."

"ఇదంత ఎక్కడ కనిపెట్టావురా?"

"చాలాలొల్లిపెట్టకు. భీమరాజనగరంలో ఒకనియిల్లు దోచాను."

"అవునురా! నేనుగూడ ఆయింటిమాట చాలరోజుల నుంచి గుర్తుపెట్టుకున్నాను. ఆమాట నీకుదక్కినది."

"ఒరే! నేను ఏటికెదురీదుతానని నీకు తెలియదురా? కాని ఈపర్యాయం కావలసినంత కథజరిగినది. నేనుగనుక బయటపడ్డాను."

"ఏమో చేసికొనివచ్చావు. మనోహరరావు కేమీ తెలియ లేదుగదా?"

"ఆసంగతి అంతా చెప్పుతాను విను. ఆయింట్లో ఖజానా పెట్టె తీయడానికి తాళంచెవులెయ్యేమని ఆయింట్లో ఉన్న కుర్రవాణ్ణి అడిగాను. వాడు కొంచెంసేపు మొరాయించాడు. రెండు దెబ్బలువేసి పండబెట్టి, కన్నుపుకత్తి చూపాను."

"కేకలు వేయలేదా"

"మొదటిసారి కుంయ్‌మనగానే గొంతుపట్టుకున్నాను. నోట్లోగుడ్డకుక్కాను."

"చివరకు తాళంచెవి యిచ్చాడా?"

"కత్తి గుండెమీదపెట్టేవరకు చేతులెత్తి దణ్ణంపెట్టి, బొడ్డులోఉన్న తాళంచెవులు క్రిందపారవేశాడు. వాణ్ణి మన వెంకడికి అప్పజెప్పి గుంజకుకట్టివేయించి, ఖజనాపెట్టె తెరిచాను. ఇదిఅంతా అందులోదే. పనిపూర్తిచేసికొని ఇంటిపైట గొళ్ళెముపెట్టి దోవపట్టాను."

"వాడు బ్రతికిఉన్నాడంటావా? చచ్చాడంటావా?"

"ఆసంగతి వెంకణ్ణిఅడుగు"

"ఏమిరా! వెంకా!" ఆ కుర్రోడు ఏమైనాడురా?

"అయ్యా! గుంజకుకట్టేటప్పుడు మెసిలితే నేనొక రెండేట్లువేశాను. గుంజకుతలవాల్చి అట్లాగేపడియున్నాడు. మళ్ళీనేను బలకరించలేదు."

"మనగణపతిగాడు ఏమిచేసుకొనివచ్చాడో అడుగురా?"

"అయ్యా! నేనురాత్రి జాముప్రొద్దు పోయినప్పుడు భీమనగరం దోవకాచాను. ఒకఆడపిల్లను వెంటబెట్టుకొని ఒకబాటసారి నెత్తిన మూటపెట్టుకొని పోతున్నాడు. నిలు, నిలు అని కేకవేశాను. ఆమూట అక్కడపారవేసి మగోడు కాలికిబుద్ధిచెప్పాడు. ఆఅమ్మాయి అక్కడనే కూలబడింది.

"ఆమెదగ్గిర ఏమైన సొమ్ములున్నాయా?

"ఉన్నాయి, సామీ! అక్కడికిఊరిలో దీపాలు కనుపిస్తూఉన్నాయి. అందువల్ల ఆయమ్మను ఆమూటను అడివిలోకి దీసికొనిపోయి దోవతప్పించాను. మత్తుమందు వాసనచూపించాను. బుజానవేసుకొని మనమామూలు చీకటికొట్టుకు చేర్చాను. ఆమెకుమైమరపు పోయినతరువాత కొంచెము మంచినీళ్ళిచ్చి, ఇక్కడనే ఉండుమనిచెప్పి తలుపుబిగించివచ్చాను."

ఆమాటలు విన్నంతటితో దొంగలగురువైన పాండురంగనిమేను ఉప్పొంగినది. వారినివెంటబెట్టుకొని చీకటికొట్టుకుబోయి తలుపుతెఱచి చూచెను. అంగనాకయువతీమణియాతనికికన్నుల పండువుసేసెను. పాండురంగడామెతో నిట్లు సంభాషించెను.

"అమ్మాయీ! మీరెవ్వరు?"

"మేము క్షత్రియులము."

"నీపేరేమి?"

"నా పేరు." "విజయలక్ష్మి"

"నీతండ్రి పేరేమి ?"

"నాతండ్రి పేరు పరాంకుశరాజు."

"నీతల్లి పేరేమందువు."

నాతల్లి పేరు "అజ్ఞనకుమారి."

"నీకు పెండ్లి అయినదా ?"

"కాలేదు."

ఈ సమాచారము వినినతోడనే దొంగలపాండురంగని చిత్తము మఱింత యాశలోబడెను. ఆయువతీమణి తను లావణ్యమును, శృంగారమయ వీక్షణములును, మాటల మృదుత్వమును రంగనిమదనవేదన నినుమడింపజేసినవి. ఈతడు ఘోరహంతకుడైనను, యామెపైగల బంగారు సొమ్ములను బలాత్కారముగ గుంజుకొనుట యతనిముఖ్య వృత్తియైనను, నామెమానసము నాకర్షించుకొనవలయునని నిశ్చయము చేసికొనియుండుటచేనాతడామెపై చేయివైవలేదు. సొమ్ములిమ్మని అడుగలేదు.

దొంగిరంగని బురకి మీసములను విశాలములై కొంచెపాటి యెరుపుగల గన్నులను, నేలచూపులను, పెద్దజరీ పేటంచు తలపాగను, బొందులలో ప్రక్కలవెంట గట్టబడి యున్న పొడువైన యంగరకాను చూచి యాతడు ఘోరకార్య సమాచరణమునకు దగినవాడని యోజించెను. అతనియంగరకాలోన నడుమునబిగింపబడియున్న యొక్కరుమాలులో నిమిడింపబడిన బాకునుబట్టి యాతడొక హంతకుడు కావచ్చునని యు గ్రహించెను. కాని వీరిబారినుండితప్పికొని ప్రాణరక్షణమును, మానరక్షణమును జేసికొనవలసిన యవసరమున్నది.

ఆమెపీరితో ప్రశ్నమునకు జవాబు నోటితో నిచ్చుచున్నను, మనస్సున రక్షణోపాయమునే యాలోచించుచుండెను. కొంత వడి రంగడును దదనుచరులును నామెపై కతినచర్యను దీసికొన కుండుటచే, వీరికేదియో తనయందాశ వొడమియున్నదని సూక్ష్మముగా గ్రహించెను. సర్వకార్యములును నాశచేతనే జరుగుచున్నవి. ఆశయను మనోవృత్తి పెక్కుకార్యముల చేయించును, సాధించును, మానవుని దేల్చును. మానవుని ముంచును. నిష్కామియగు ధీరుని మోసగించుటదుష్కరము. కామియై యాశాబంధమున దగుల్కొనువానిని వంచించుట అసాధ్యముగాదు. కావున వీనియభిప్రాయము కొంతకాలము నకు నెఱవేఱునేమోయను నాశాబంధమున వీనింజిక్కపెట్టి ఫలాపేక్షయందు డోలాయమాన మనస్కునిఁజేసి తుదకు మోసగించి వీనికిదగిన ప్రతీకారము జేసెదనుగాక" అని రెండు నిమిషములలో నంతర్భావమున విచారముసేసికొని అపూర్వమైన మందహాసమును మొగమ్మున నారోపణముసేసికొని వానిప్రశ్నలకిట్లు ప్రత్యుత్తరము లీయసాగెను.

"రాజకుమారీ! నీవు వివాహముసేసికొని సాంసారిక జీవితము నడుపనిచ్ఛగించుచుంటివా? లేక బ్రహ్మచారిణివిగా నుందువా?"

"నాకు కొన్నినియమములుగలవు, కొన్నిఅభిలాషలు గలవు. నామనోరథముల నీడేర్పగలసమర్థుడు నాకులభించు నేని, నేను సాంసారికజీవిత మవలంబించెదను. అట్లులభింపని యెడల, బ్రహ్మచర్యముచే పరమాత్ముని పవిత్రనామమును సంస్మరించుచు, గాలక్రమమున భగవత్సాన్నిధ్యవర్తనమును

సాధించెదను. నాచిన్ననాటినుండియు నియ్యదియే నాయభిప్రాయము.”

ఈప్రసంగము పాండురంగని హృదయమును మఱింత కలంతపెట్టినది. ఆశ్చర్యము గలుగజేసినది. అంతనతఁడు నిట్టూర్పువిడిచి తలపంకించి “ఆ నియమములెట్టివో ప్రకటింప గలవా” యని ప్రశ్నించెను.

“ప్రకటింపనేమి ? నాయందభిలాషనొంది నన్ను వివాహము చేసికొనదలంచువాని ప్రేమను, విశ్వాసమును నేను బరీక్షించుకొనవలయును. నేను ద్రవ్యము నాసించుదానను కాను. నేను క్షత్రియకన్యనగుటచే వీరసాహస కార్యసమాచరణమున కెల్లప్పుడును నేను నుద్యమించుచుందును. సంగ్రామకేళికవసరమైన వేషమును నేనుధరింతును. నాచేత నెల్లవేళలయందును నొకఖడ్గముండవలయును. అసత్కార్యమును, క్రూరకార్యమును నాచరించు హంతకుని జూచినప్పుడు నేను సమయోచితముగ నొకవ్యక్తి నంతమొందించినచో, నాప్రియుడందులకు సమ్మతింపవలయును.”

పాండు:—ఇదియంతయువిన సొంపుగనేయున్నది. తరువాత నియమములను జెప్పుము.

విజ:—“ఇంతకుమున్ను నన్నొకమానవుడు ప్రేమించి, నాకొక రత్నాంగుళీయకమును, జేతిగడియారమును నొక మణిపేటికలోనుంచి ప్రధానద్రవ్యముగా నాకందజేసి యున్నాడు. ఇతడు నాయభీష్టమును సమక్షమున గనుగొనక, మాతలిదండ్రుల సమ్మతినిదీసికొని ఒకమణిపేటికను నాకొఅకు బంపెను. ఆమణిపేటికను నేను వానికిదిరిగివంపివేయ నుద్య

మించుచుంటిని. ఆసమయమున నాతలిదండ్రులు నాయూశి యము నెఱింగి "యీ పేటికనెవ్వని యపహరించునుపి గొలిక దాసిని జేర్పించిరి. ఒకరేయి నేను నిదురించుసమయమున మంజరియను నాదాసి దానిని దొంగిలించినది. అదాసినెను దిరిగి యగపడలేదు. ఆమణిపేటికను సాధించి, దానిని తిరిగి యీ పురుషునియొద్దకు జేర్పించినదనుక నేనన్యులకు స్వాధీను రాలను గాగూడదు. నన్నుకేల్పట్ట నెంచినపురుషుడు తొలుత నామణిపేటికనుదెచ్చి నాకుజూపి, స్వయముగాదాని దదధికారి కందఁజేసి, నేనాతనికి వశురాలను బ్రియురాలనుగాదని తెల్ప వలయును. ఈ ప్రయత్నమున నతని నుదాసీనునిజేసి ఈయుభి లాషనుండి యతనిని మరల్పవలయును. ఒకవేళనతడు మూర్ఖ తచే నాతోడఁ బోరాటము పెట్టుకొనినచో నతనిగర్వమడంచి దూరముగ పారదోలవలయును. ఇయ్యది నా రెండవ నియ మము."

పాండు:—ఈ వ్యవహారము అసహజమైనదికాదు. అంతే యగాక అట్టివానిని సంపూర్ణముగ విసర్జించి విముఖునిజేయుట అవశ్యకర్తవ్యము. అదియును నెఱవేఱగలదు. మఱేమయిన నియమమున్నదా?

వి:—"ఇఁకనింత అవసరమైనవి యేమియులేవు. కాని మఱియొక నియమమగలదు. నేనుతఱుచుగ ఖడ్గపాణినై, యశ్వముపైననో, శతఘ్నిగైకొని యంత్రశకటముపైననో బయలునకు విహారార్థమై పోయివచ్చుచుందును. అట్టియెడల నన్ను నిరోధింపరాదు. నాసంచారము నెన్నడును నడుమా నింపరాదు."

పాండు:—నీస్వాతంత్రమున కెన్నడును భంగము గలుగ జాలదు.

విజ:—"ఈ నియమముల కంగీకరించినమానవునికి నేను వశురాలను."

పాండు:—యువతీరత్నమా! నీ నియమములకు నేనంగీకరింతును.

విజ:—"అట్లయిన దొలుత నాకొకఖడ్గమును శతఘ్నిని నిమ్ము. నీవు మణిపేటికను సంగ్రహించుటకు బయలు దేరుము."

పాండురంగడందులకు సతోషపూర్వకముగ సమ్మతించి వాడిగల యొకఖడ్గమును నొకచిన్నతుపాకిని నామెచేతి కొసంగెను. ఆమెదుస్తులను మార్పించి, సైనికవేషము ధరింపజేసి, అచ్చటగల కొలనిపాటియంగణమున నెడమెడముగ నున్న రాతిదిన్నెలపై గూర్చుండజేసి, ఇంచుకతడవామెతో సంభాషించెను. ఈనాఁడు తెలవారుజామున బయలుదేరి నేనారత్న పేటికను సాధించికొనివచ్చెదనని చెప్పెను. ఆగుహాగర్భమున స్వతంత్రముగ విహరించుచుండులాగున నేర్పాటులు గావించెను.

---

# 3. ఆపదలకు సమయము లేదు.



పరిజారామ విహారము ముగించుకొని హేలావతీ మహావీరులు చీకటిగృహముయొక్క వైచిత్ర్యముజూచుటకై బయలుదేరిరి. చీకటిగృహముయొక్క ముఖద్వారమున నొక్కరక్షకోద్యోగి యొకపెద్దపాత్రము, నొకబల్లపై నుంచుకొని, కొన్ని చిన్నిచిన్నిచీటీలు వద్దనుంచుకొని యుండెను. ఈయుద్యోగి అనుజ్ఞలేక యెవ్వరును లోనికిబోరాదు. మహావీరుని జూచినతోడనే ఆయుద్యోగి వారినిట్లు ప్రశ్నించెను.

"అయ్యా మీదేగ్రామము ?"

"భీమరాజనగరము."

"ఏమికావలయును ?"

"ఈ చీకటియింటి నిర్మాణవైచిత్ర్యముచూచి పోయెదము, అనుజ్ఞకావలయును."

అప్పుడాయుద్యోగి వారిపేరులను తనయొద్దనున్న పెద్దగ్రంథములో వ్రాసికొని, వారికొక యనుజ్ఞాపత్రము నిచ్చెను. వారాపత్రమునుగైకొని, లోనికిబోయిరి. వారిత్రోవ రమారమి ముప్పదియడుగులవెడల్పు గలిగియుండెను. దానికిరుప్రక్కలను నిరువదియడుగులయెత్తైన రాతిగోడలుండెను. ఆత్రోవ పోయినకొలది యేటవాలుగా గ్రిందిమట్టమునకు బోవుచుండెను. పదిగజములకొక రక్షకభటుడు విచ్చుకత్తులతో కావలాగాయుచు నిలుచుండియుండెను. ఏబదిగజముల

దూరము పోవువఱకు, భూమిమట్టము ఇరువదినాలుగడుగుల ఎత్తున నగపడుచుండెను. ఆబాట ఏబదియడుగుల యావల నెడముప్రక్కగా దిరిగెను. ఇచ్చట నీబాటకు నెడమప్రక్క గోడయుండెను. కుడిప్రక్క నారుగజములకొక యినుపచువ్వల ద్వారముగపడుచుండెను. పై భాగమంతయు రాతితో కప్పు వేయబడియుండెను. కుడిప్రక్క వరుసగా నాలుగదులుండెను. ప్రతిగదికిని నొక్క యినుపచువ్వల ద్వారముండెను. ఆఱవ గదిలో నొకరక్షకభటుడు నివసించుచుండును. శేషించిన యైదుగదుల తాళములచెవు లీతనిగొద్దనుండును. ఈ చెఱ సాలలో నుండువారిని బయటికి బంపనగుసమయములయందీ రక్షకభటుడు, తలుపులు తెఱచుచుండును.

ఆ భూగర్భస్థమగు నిర్మాణమునకే చీకటియిల్లని పేరు. పగటివేళనయినను, నాప్రాంతమంతయు గాఢాంధకార పరి వ్యాప్తమైయుండును. అందును నాడు వినువీధిని కాఱుమబ్బు లావరించియుండుటచే వెలుతురుఅనునది యెచ్చటను లేకుం డెను. అప్పటికి నాలుగుగడియల వేళయగుటచే పద్ధతి ప్రకా రము కారాగృహ వాసులనందఱిని బయటికివిడిచిరి. ఎచ్చటను నొక్కదీపమైనను లేకుండెను. ఆచుట్టుప్రక్కల వింతవిశేష ములనన్నింటిని, జూచుచు మహావీరదంపతులందే ప్రొద్దు పుచ్చిరి. సూర్యాస్తమయమగుటచే, వెలుపలతోటలో పాటు సేయుచున్న నిర్బంధితులింక నిజస్థానములకు జేరవలసి యున్నది. నాలుగవగదిలో ప్రవేశించి హేలావతీ మహావీరు, లానిర్మాణ్య చాకచక్యమునుగుఱించి సంభాషించుచుండిరి. కొదువచెఱసాలలలోనివారు పద్ధతిప్రకారము తమనిత్యాచార

ముగ చెఱసాలలలోనికి బోయియుండిరి. కావలిగాచు, రక్షక భటుడువచ్చి కారాగృహ ద్వారములనన్నిటిని మూసెను. నాలుగవసంఖ్యగుర్తుగల చెఱసాలలో మహావీరదంపతులు మూయబడిరి.

మహాభోగశాలులైన యీ దంపతుల జీవితసూత్ర తారుమారైనదో వర్ణనీయము.

చిత్రి చిత్రి వర్ణములచే వేయబడిన బొమ్మలతో మనో రంజకములుగానుండి కనుదెఱచినమాత్రమున దుస్తిని మేల్మి నవానంద మంకురింపజేయు వారిశయ్యామందిర సుఖానుయ కుడ్యములిప్పుడు గొగ్గిరాతిగోడలయ్యెను. ఇసుక రేణువుల యొత్తిడినైన సహింపక రత్నకంబళముల సాహచర్యమున నొరపిడియెఱుగక, కోమలపల్లవ సదృశములైన పాదముల కిప్పుడు కలుకురాలపోటమరింపుగల ధూళినేలపై మోపవలసి వచ్చెను. రసనేంద్రియమును దన్మయత్వమునొందించు భిన్న భిన్నాభిరుచ్యముగల పలుపదార్థములతో నాస్వాయనముగ నారగింపబడు షడ్రసోపేత భోజనముభావమయ్యెను. పిలచిన పిలుపునకు దలయొగ్గి యానలనెఱవేర్చు భృత్యులకుమాఱుగ జుట్టునువిచ్చుకత్తుల రక్షకభటులు విధేయతనుశాసింప దృగ్గో చరులై యుండిరి. ఉన్నతావున, నేమియున్నదో చూచు కొనుట కొక్కదీపికయైన లేకుండెను. పర్వతాంతర్గుహాగర్భ మానసుండు చిమ్మచీకటి యీచెఱసాలకు ముఖ్యలక్షణము. హేలావతిమనంబున చీకటియింటి నెప్పుడుచూచెదమాయని పొంగిపొరలిన యుత్సాహమిప్పుడిచ్చటి కేలవచ్చితిమా యను

విషాదమూగ మాఱిపోయినది. దంపతులొక్క యాగారమున నున్నను ఒకరిమొగమునొక్కరు చూచుకొనుభాగ్యము లేకుండెను. హేలావతి యెంతబిగపట్టినను జిత్తమూగక దుఃఖమయమై యెలుగెత్తియేడ్చి నేమియపరాధమోయని లోలోన బొగులసాగెను. మహావీరుడతిధైర్యమున "ప్రియా! ధైర్యముతో నుండుము. నిరపరాధుల కిట్టికఠినశిక్ష విధింపవలయునని యేన్యాయశాస్త్రమును బోధింపదు. రక్షకశాఖాధికారి వచ్చినవెంటనే మనకు నిర్బంధవిమోచనము కాగల"దని ధైర్యోక్తుల నాడుచుండెను. అప్పటికించుమించు యెనిమిది గడియలరేయి గతించినది.

మహావీరదంపతులను మోసగించిన దోపిడిగాండ్రు మహావేగమున కావలివాని యాఅవగదిలోనికి బోయిరి. ఆ యిరువురలో నొక్కడు తాను రక్షణశాఖాధికారినుండి వార్తదెచ్చినవానివలె నత్యవసరసంభాషణము ప్రారంభించెను. రెండవవాడు వానిప్రక్కగోడ కమరించబడిన యొక్కఖడ్గమును దటాలునదూసి కావలియున్న రక్షకభటునిగళమున నొక్కవ్రేటువైచి శిరశ్ఛేదముగావించెను. వెంటనే యందు సిద్ధముగనున్న రక్షకభటుల దుస్తులనుధరించుకొని హంతకులిరువురును, నధికారులయాజ్ఞపై బయలుదేరిన రక్షకభటులవలె, బిరబిర నడచుచు చీకటిగృహమునుండి తప్పించుకొని పోయిరి. మూడుగంటలకాలము నిర్జనప్రాంతమున ద్రోవగానితోచినవెంట నతివేగముగ బ్రయాణముచేసి నడిరేయిదాటువఱకు తమగూఢనివాసమగు పాండురంగని రహస్యాలయమునకు జేరిరి.

కొన్ని ఘడియల కాలమయినపిమ్మట చీకటిగృహ ములో కాపలాభటులు తమవంతులప్రకారము మార్పుచెంద వలసిన అవసరమగుటచే, దుస్తులు మార్చుకొనునిమిత్తము ఆఱవగదికివచ్చిరి. గదియంతయు రక్తమయముగానుండెను. రక్షకభటుని కళేబరము రెండుతునియలై నేలబడియుండెను. రక్షకభటులాశ్చర్యమును విచారమును బొందుచు, కర్తవ్యతా మూఢులైరి. వారిలోనొకఁడు విషయమును గ్రహించి వెంటనే మనోహరరావు ఫతేదారు కార్యాలయమున కొక సైకిల్‌పై నతివేగముతో బోయెను. మిగిలినవారు శవమును గదలింపక ఉన్నదానినున్నయట్లు కాపాడుచు పరిశోధన శాఖాధికారియగు మనోహరరావురాక కెదురుచూచుచుండిరి.

మహావీరుడు చీకటిచెఱసాలలోనుండి వెలువడుట కేమైన యుపాయమున్నదాయని యాలోచించెను. చీకటి మయముగా నున్నకారణమున గోడలలోనెక్కడను నొక్క బీటువారినచోటైనను నగపడలేదు. చుట్టుగోడలనన్నింటిని ఆరడుగులయెత్తువఱకు చేతితోదడిమిచూడ నారంభించెను. తుట్టతుదకొక్కమూల నాలుగడుగులయెత్తువఱకు మూడడు గుల వెడల్పుగ గోడలో వ్యత్యయమగపడెను. ఆవ్యత్యయము చుట్టును జేయిబెట్టి తడిమిచూడగా నొక్కపగులుగా నగ పడెను. అది యొకచిన్నద్వారమని గ్రహించెను. వెంటనే తన చొక్కాజేబులోనున్న చిన్నిమడతచాకును దీసికొనివిప్పి పగులులోబెట్టి నెట్టెను. ద్వారము తెఱువబడెను. అత్రోవ వెంట మహావీరదంపతులు ఒకపెద్దమందిరములో బ్రవేశించిరి. అందులో నొకచిన్నివిద్యుద్దీప ముండుటచే భవనమంతయును

గొద్దిపాటి వెలుతురుచే నిండియుండెను. నడిప్రదేశము నొక పెద్దవ్రాతబల్లయు దానిచుట్టును కుర్చీలును నమర్చబడి యుండెను. ఆ మందిరముయొక్క వైఖరిజూడ నదియొక యుద్యోగికార్యస్థానముగా నగపడెను. వ్రాతబల్లకు నెడమ వైపున నొక వేదికపై వార్తాయంత్రము (టెలిఫోను) ఏర్పాటు చేయబడియున్నది. దానికి పైభాగమున గోడనంటి ఒక వార్తాయంత్రి సంఖ్యాపట్టికయు వ్రేలాడుచుండెను. మహావీరుడు తనపరిస్థితినిగుఱించి తనకుమారుడగు ప్రభాకరరావునకు, వార్తాయంత్రిసహాయ్యమున విశదపఱచెను.

---

# 4. విచిత్రమణి పేటిక

భీమనగరములో నొక పెద్ద యంగడియుండెను. అది వెండిబంగారు సొమ్ముల క్రయవిక్రయములు సాగించు నన్ని యంగడులలో, పెద్దదియును బాగముఖ్యముగలదై యుండెను. ఆ మఱునాటియుదయమున నెనిమిదిగంటల ప్రొద్దెక్కుపటికి అంగడియజమానియగు హీరాలాల్ అను పేరుచెప్పుకొను నొక గంభీరపురుషుడు అంగడి తెఱచి, వ్యాపారము ప్రారంభించెను. ఆసమయమున బాహాటముగ నొకమణిపేటికను

జేతనుంచుకొని సొమ్ముల యంగడికి వచ్చెను, తనచేతనున్న మణిపేటికను హీరాలాల్‌కుచూపి దీనికివెలకట్టి విక్రియము నొంది క్రియధనమునిమ్మని యడుగుచుండెను. దానిపై చెక్కబడిన మణులవరుసను జదివినయెడల "భీ॥ ప్ర" అను రెండక్షరములు పఠనీయములై యుండెను.

హీరాలాలు పేటికనుదీసికొని త్రాసులోనుంచి తూచెను. అది పదియేనుతులముల బరువుగలదిగా నుండెను. దానిమణికట్టడము మనోహరముగా నుండుటచేతను, అచ్చపు మేలిమిబంగారుతో జేయబడియుండుటచేతను, మణులును నమూల్యములైన మేలిజాతికి జెందియుండుటచేతను, హీరాలాల్ దానిని మూడువేలరూపాయిలకు పైగానుండునని గ్రహించెను. హీరాలాల్ దాసాంగననుజూచి "ఈ పేటిక షుమారు మూడువేలరూపాయిలు చేయును. ఇప్పుడు మాయొద్ద అంతనగదు సిద్ధముగాలేదు. రాబోవు సోమవారము నాటికి పైకము పూర్తిగా నిచ్చివేయుదుము. ఇప్పుడునీకు అవసరముగా గావలసినపైకము తీసికొని ఈమణిపేటిక మా దుకాణములో నుంచిపోవచ్చును." అనిచెప్పెను. మంజరి యను నాదాసాంగన అందులకేమి చేయవలయునని యాలోచించుకొనుచు, గూర్చుండెను.

అంతలో ఫతేదారు మనోహరరావు విధినిర్వహణము నకై బజారుకువచ్చెను. అద్దములపెట్టెపై బజారుకెదురుగ నుంచబడిన యా విచిత్రమణిపేటిక మనోహరరావు దృష్టి నాకర్షించెను. "ఈపేటిక బేరమునకువచ్చెనా" యని మనో హరరావు హీరాలాలునడిగెను. హీరాలాలు తనవేలితో

మంజరినిజూపి, "యిప్పుడే ఈయువతి యీపేటికను విక్రియ మునకు దీసికొనివచ్చినదని హీరాలాలు ప్రత్యుత్తరమిచ్చెను. మనోహరరావు దాని వెలనుదెలిసికొని, యామంజరి మొగము వంకఁ దేఱిపాఱజూచి యామణిపేటికకు యజమాని యామె యైయుండదనియు యామె మఱియొకయజమాని పనుపున వచ్చియుండవచ్చునని తలంచెను. అట్లుగానియెడల నొక యజమానియింట సేవసేయుచు నామె దానినపహరించి యుండవచ్చుననియు నూహించెను. అందువలన మనోహర రావు హీరాలాలును లోనికిదీసికొనిపోయి "ఈ మణిపేటిక యను మానవుఆస్తిగా భావించుచున్నాను. దానిని నీయొద్దనే యుంచుకొని, ఒకఏబదిరూపాయిలు ఆమెకిచ్చి ఆమెయుండు తావు మన్నగాల పూర్తివిలాసమునుదీసికొని యుంచుమని రహస్యముగాజెప్పెను. తిరిగినిరువురును నంగడిలోఁగూర్చుండి నప్పుడు, మనోహరరావు, ఒకకొలబద్దను దీసికొని, దాని వెడల్పును నిడివిని, ఎత్తును గొలుచుకొని, దానిఅభివర్ణన యంతయు దనజేబులోని ప్రొత్తములో వ్రాసికొనెను.

ఆసమయమున మహావీరునిపుత్రిడగు ప్రభాకరరావు ఒకసైకిలుపై ప్రయాణముచేయుచు, నతివేగముగ నాయంగడి యొద్దనున్న మనోహరరావునుజూచి, వందనముచేసి "అయ్యా మీకొఱకు కార్యాలయమునకుబోయితిని. మీరిచ్చట నుండ వచ్చునని తెలిసికొనివచ్చితిని. ఈ విజ్ఞప్తిని చిత్తగించుడని "ఒకపత్రమును జేతికందించెను." ఇదేవచ్చుచున్నాను. నీవు కార్యాలయమునకు నడువుమని ప్రభాకరరావుతో ననెను. ప్రభాకరరావు అద్దపుపెట్టెపైనున్న మణిపేటికనుజూచి

యొక్క-పరి త్రుటికాలము మిన్నకుండి యొక్క-నిట్టూర్పు విడిచెను. దానిపైన దనపేరు షోడియక్షరములతో భీమరాజ నగరం ప్రభాకరరావు అని ఖచితము చేయబడియుండుటను జూచెను. ఖిన్నవదనయైన మంజరిని, మనోహరరావు నునికిని హీరాలాలు యోజనాపరిస్థితిని విలోకించి ఇందేమో జరుగు చున్నదని, యనుమానించి తానేమియుమాటాడక రక్షణ కార్యాలయమునకు బయనమయ్యెను. మనోహరరావు మంజ రినిజూచి "నీవును మా కార్యాలయమునకురమ్మా. నిన్ను కొన్ని విషయము లడుగవలసియున్నదని చెప్పెను. మువ్వు రును గలిసి రక్షణకార్యాలయమునకు బోయిరి.

హీరాలాలు వ్యాపారము సాగించుచుండెను. అతని కుమారుడగు మోహన్‌లాలునకు అప్పటికి మూడుదినముల నుండి జ్వరమువచ్చుచుండెను. నాడుజ్వరము నూటఅయిదు డిగ్రీలవఱకుబెరిగి తీవ్రదశను దాల్చెను. అతనియింటివద్దనుండి యొకసేవకుడువచ్చి, "అయ్యా నేడు మోహన్‌లాలు పొర పాటు తబ్బిబ్బుమాటలాడుచున్నాడు. వైద్యుని తక్షణము పిలిపించవలయునని సేఠానీగారు చెప్పుచున్నారని తెలిపెను. హీరాలాలుమనస్సున నెక్కు-వ ఆవేగమునుబొంది ఒకచీటి వ్రాసి సీపీసైకిలుమీదబోయి తత్క్షణమున డాక్టరు ఆనంద రావును దోడ్కొ-ని రమ్మనిచెప్పి, సేవకునిచేతికిచ్చెను. అయిదునిమిషములు గాకమునుపు ఆనందరావుడాక్టరు అంగడికి వచ్చెను. హీరాలాలు డాక్టరుకు అభివందనముచేసి కూర్చుండ బెట్టి గౌరవించెను. ఆసమయమున నాసువర్ణమణిపేటిక ఆనంద రావు కంటబడెను. వారిరువురు నిట్లు ప్రసంగముజరిపిరి.

"ధనీ ? ఈమణిపేటికను మీరుచేయించితిరా ? అమ్మ కమున కుంచితిరా"

"ఇది నేనుచేయించినదికాదు. విక్రియమునకు దీసి కొంటిని. వ్యాపారస్థలముగనుక, అమ్మకమునకు జూపు చున్నాను."

"అట్లయినచో దీనివెలయెంతయైనను నేనొసంగగలను. నాకుదెలియజేయక యీ మణిపేటికను మీరెవ్వరికిని విక్ర యింపవలదు."

"సంతోషము. అట్లేచేసెదను."

"మీరు నాకొఱకేల మనుష్యునిబంపితిరి ?"

"మా మోహాన్‌కు జ్వరము తీవ్రముగానున్నది. మీరు తగిన ఔషధమునొసంగి మాయిల్లు నిలువబెట్టవలయునని ప్రార్థన."

హీరాలాలు గొప్పధనవంతుడగుటచే డాక్టరు ఆనంద రావు సంతోషముతో నంగీకరించెను. హీరాలాలు వెంటనే దుకాణముమూసివేసి తాళముబిగించి, ఆనందరావును వెంట బెట్టుకొని నిజగృహమునకు బోయెను. మోహాన్‌లాల్కు సన్నిపాతజ్వరమగుటచే, నదితీవ్రమై సంధిజనించెను. డాక్టరు చేయిజూచి "పరిస్థితి చాలవిషమించినది. గొప్పఔషధములు వాడవలసియున్నది. సాధారణముగా నిది తిరుగువ్యాధికాదని చెప్పెను. అంత దీనవదనుడై హీరాలాలు "మీరేమికోరినను నిచ్చెదను. ఎట్లైన నాకుమారుని బ్రతికింపవలయునని వైద్యుని వేడుకొనెను. మోహానుతల్లి అధికముగ శోకించుచు, మీరేదికోరినను దప్పకయిచ్చెదము. ఎట్లైన నాకుమారుని

బ్రదికింపుడని యతిదీనతతో నర్థించెను. ఆనందరావు వెంటనే సంచి తెఱచి ఔషధములదీసి మోహానునోరు బలాత్కార ముగా దెరపించి, మ్రింగునట్లుగా అంగటిలో వేయించెను. ఆనందరావునైతము కొంతతడవచ్చటనే గూరుచుండెను. మోహానునివ్యాధిరీతి కొంచెము మార్పుచెందు సమయమున, తిరిగివైద్యుడు మఱిరెండు అవేమందుమాత్రలను దినిపించెను. ఒకగంటతడవు, నిశ్శబ్దముగాఁ బండనిమ్మని ఆనందరావు నిజ గృహమునకు బోయెను. అతడింటివద్ద భోజనాదులను గ్రహించి తిరిగి రోగియొద్దకువచ్చి మఱిరెండు మందుమాత్రల నిచ్చి యిఁక మీరు భయపడవలసిన పనిలేదు. మోహాసుని నేనుబ్రతికించెదను. వానిఆరోగ్యము నాభారమనిచెప్పెను. మఱియునాకోరిక మీరు నెఱవేర్పవలయునుజుడీ యని హెచ్చ రించెను. సాయంకాలము ఆఱుగంటలగువఱకు మోహాన్ లాల్ లేచి మంచముమీదనే కూర్చుండి దుర్బలముగా నున్నను, నాహారముదెమ్మని అడుగనారంభించెను. అడిగిన అన్నిప్రశ్నలకు సూటిగా నుత్తరువులు చెప్పుచుండెను. ఆనంద రావు మఱియు నెనిమిదిగుళికలనిచ్చి, వీనిని జామునకొక రెండుచొప్పున రాతిరియెల్ల వాడుడు. ఉదయమువఱకు జ్వరమునైతముతిగ్గి మోహాను క్షేమముగా నుండగలఁడని చెప్పెను. అప్పుడు, హీరాలాలుమనస్సు చాల నుత్సాహా ముతో నుండెను. ఆనందరావు సమయమును గనిపెట్టి "నేనేమిబహుమతి గోరుదునో మీకుదెలియునాయని హీరా లాలుతో ననెను.

"తెలియకేమి? ఈనాటియుదయమున మీరు మా యంగడికివచ్చినప్పుడు మీరు చూచినమణిపేటికను దీసికొనుటకు మీరభిలషించుచున్నారు. రేపటియుదయమున నంగడి తెఱచినవెంటనే యామణిపేటికను మీయొద్దకు బంపుచున్నాను. దానివెలలోనుండి మీరునానుండి ఈసందర్భములో నభిలషించినమొత్తమును దీసివేసి, శేషించినభాగమును నాలుగుపర్యాయములుగా మీరు నాకందజేయుడని చెప్పెను. ఆనందరావు అపరిమితానందమయ చేతస్కుడై పేటికయొక్క వెలకూడ నిర్ధారితముగా చెప్పుమనెను. "అంత హీరాలాలు" పేటికవెల మూడువేలరూపాయిలు. మీకొఱకు దానిని రెండువేల అయిదునూరురూపాయిల కిచ్చెదను. ఆమొత్తములో అయిదునూరురూపాయిలు మీవైద్యమునకు బహుమతిక్రింద వదలివేయుచున్నాను. అంతియగాక, శేషించిన రెండువేలరూపాయిలు, నాలుగుపర్యాయములుగా చెందజేయవచ్చునని పల్కెను. ఆనందరావు తనయభిలాష సిద్ధించినందుల కెంతయోసంతసించి, రోగికిజేయదగిన యుపచారము నుదెల్పి, మెల్లగా తనయిల్లుజేరుకొనెను. మఱునాటి యుదయమున సరిగా ఎనిమిదిగంటలవఱకు ఆనందరావు గృహమునకు మణిపేటిక బంపబడెను. ఆనందరావు దానిని సంతోషముతో గ్రహించి, తనవెండిబంగారు సామానుల పెట్టెలో నుంచుకొని భద్రముగా గాపాడుకొనుచుండెను.

# 5. చారుని చాతుర్యము.



దొంగలనాయకుఁడగు పాండురంగఁడు స్వయముగా హత్యావ్యాపారమునకు అలవాటు పడినవాఁడగుట మణిపేటిక నెట్లైనను నార్జింపగలననియు, నెవ్వనియొద్దనున్నను వానిని వధించి తీసికొనిరాగలననియు ధైర్యముతో నుండెను. విజయలక్ష్మి యప్పుడప్పుడు వానికండ్ల కగుపడుచుండుటచే నీమె నెట్లయిన స్వాధీనము చేసికొనగలనని యుత్సాహపడుచుండెను. విజయలక్ష్మి రూపలావణ్యాదు లతనికపూర్వానుభూతములగుటచే, అతని రాగాతిశయమును, నినుమడించుచుండెను. దినక్రమమున విజయలక్ష్మి యా చోరగుహాభవనమున బరిచయమునార్జించి యందలిరహస్యములన్నియు దెలిసికొనెను. ఎప్పటికైనను చోరసమూహమును మోసగించి తానానిర్బంధావాసమునుండి బయలుపడగలనని ధైర్యము తెచ్చుకొని చోరులపై యాజమాన్యము గలదానివలె నటించుచుండెను. పాండురంగఁడు వలచినయువతియగుటచే, మిగిలినచోరులెల్లరు, నామెనధిక గౌరవముతో జూచుచుండుటయేగాక యామెచేయు నానతులనెల్ల శ్రద్ధాభక్తులతో నెఱవేర్చుచుండిరి. విజయలక్ష్మి మణిపేటికను నందులో నుంచబడియున్న యుంగరమును జేతిగడియారమును దీసికొని వచ్చి ప్రసన్నజూపించుట నొక్కనియమముగా చెప్పియున్న క్షణమునుండియు, పాండురంగనిదృష్టి దానిపై బడియుండుటచే, నాపనికై యొక్కచారుని నియమించియుండెను.

ఆ చారుఁడు పెద్దబజారులోని హీరాలాల్ అంగడిలో వ్యక్త ముగా అద్దాలపెట్టెపై నుంచబడియున్నప్పుడే మణిపేటికను జూచియుండెను. అతడమ్మకమునకు జూపుచుండుటను దెలిసి కొని, దీని నెవ్వరుకొందురు ? ఇది ఎవ్వరియింటజేరునని జాడ తీసికొనుచు నేయుండెను. తుదకు క్రిందటిదినమున హీరాలాలు దానిని ఆనందరావు వైద్యునియింటికి బంపినవిషయమును స్వయముగా జూడగలిగెను. తాను, ఆవర్తమానమును దెలిసి కొనినవెంటనే పాండురంగనికి దెలియజెప్పెను. ఆనందరావు యంటినుండి యీ స్వర్ణమణిపేటికను సంగ్రహించుట కేమి యుపాయమని పాండురంగడు తీవ్రముగ నాలోచనలు సేయు చుండెను. అంత నతనిచోరులలో సాహసియగు "వెంకడు" అను వానినిబిలచి, ఓరీ ! రేపురాత్రి పన్నెండుగంటలసమయ మున—అని మఱికొన్నిమాటలు వానిచెవిలో రహస్యముగా చెప్పెను.

పదంపడి పాండురంగడు తనవేగువానినిబిలచి వానితో నిట్లుప్రసంగించెను.

"ఓయీ ! నగరములోని యితరవార్తలేమి ?"

"చిత్తము ! దేవరా ! పతేదారు మనోహరరావు చీకటిగృహములో జరిగిన హత్యనుగుఱించి చాలతీవ్రముగ విచారణ చేయుచున్నాడు. నగరములోని కొంతమందిప్రజలు ఇంత ఘోరసాహసకృత్యము పాండురంగనివలననే జరిగి యుండునుగాని యితరులిట్టిసాహసము జేయజాలరని మనో హరరావుకు విశ్వాసము గుదురఁజెప్పిరి. ప్రజాసంఘములో నేనును నొక బీదకాఁపువానివలె వర్తించుచు ఈ ప్రసంగము

నంతయును వినుచుంటిని. "అట్లయినచో నిద్దతెక్కడనుండి వచ్చిరని శంకించిరి."

"అప్పుడు నీవేమియు మాటాడలేదా ?"

"దొంగలరంగడిప్పుడు నైజాములోనికి వెళ్ళిపోయినట్లు చెప్పుకొనుచున్నారు. ఈహత్య ఎవరివల్లనో జరిగినదిగాని ఇందుఅతనికి సంబంధములేదని చెప్పితిని."

"నైజాముప్రదేశములోనికిగూడ వెళ్ళియుండవచ్చును అంతమాత్రముచేత దొంగరంగని కీప్రాంతములోజరుగు దురంతములలో సంబంధము లేదనిచెప్పుటకు వీలులేదు." అనిపల్కి "దొంగరంగని పట్టితెచ్చినవానికి ఒకవేయి రూపాయిలు బహుమతినిచ్చెదనని మనోహరరావు ప్రజలకు దెల్పెను. గ్రామసేవకునిబిలిపించి అన్నివీధులయందును నందఱి కిని దెలియునట్లు దండూరావేయించెను." తన రక్షకభటుల కందఱికిని బాండురంగని బట్టుకొనుటవలనగలుగు నుపయోగ మును గుఱించి బాగుగాదెలియజేసి, ఈకార్యము నొకప్రత్యేక దృష్టితో జూచుచుండవలయునని హెచ్చరించెను. మీారే మాత్రము ఏమఱుపాటుతోనున్నను, మనోహరరావు మీాకు హానిచేయగలఁడు. స్వయముగా మీారగపడినచో, అతడు కాల్చివేయగలఁడు మీాజీవితము సురక్షితము జేసికొనదలచ్చ గించుచో, మీారేదో యొక యుపాయముబన్ని మనోహర రావునే యంతమొందింపవలయును.

"అతడిప్పుడెచ్చటనున్నవాడు."

"స్వామీ ! ఎచ్చటనని చెప్పుదును వారదేవిధముగా తిన్నచోట బండకయు, బండినచోట తినకయు నన్నిప్రదేశ

మాలయందును నేదో యొక నెపమాన దిరుగాడుచు నేయుండును. మనజట్టులోనివాడు చీకటి చెఱసాలలో నిర్బంధింపబడి మహావీర దంపతులను మోసగించి, రక్షకభటునివధించి, బయలుపడిన క్షణముననుండియు, మహావీరుని కుమారుడగు ప్రభాకర రావును దోడుగాదీసికొని నిన్ను పరిమార్ప బ్రయత్నించు చున్నాడు."

"ప్రభాకరరావుకు నాపైన బ్రత్యేకవైరుధ్య మేల యేర్పడెను ?"

"ప్రభాకరరావు యిల్లుదోయించి, యతనినిగొట్టి గుంజకుగట్టి వంచించినచోరులు మనజట్టులోనివారని యతడు తెలిసికొనెను. అగ్ని దేవునికి వాయుదేవుడు తోడైనట్లు మనోహరరావుకు ప్రభాకరరావు తోడైనాడు."

ఈ వాక్యములు వినినతోడనే పాండురంగని కన్ను లెఱ్ఱవారెను. అత్యుగ్రమైన కోపావేశముతో తలపంకించి, ఆక్షణముననే బయలుదేరి మనోహరరావుపై కుటికి కుత్తుక గోయ నుంకించువానివలె మేనునిగుడించెను. అనతికాలమున నాగ్రహము తగ్గించుకొని, ప్రస్తుత కర్తవ్యమునుగుఱించి యాలోచించెను. తన వేగువానినిబిలచి "ఓయీ ! నీవింకను జేయవలసినపనియున్నది. అని యతిరహస్యముగా మఱిరెండు వాక్యము లతనిచెవిలో జెప్పెను.

"అతడును మీావన్నాగము బాగున్నది. అట్లేచేసెద ననెను.

---

# 6. హంతకునకు దయారస మెక్కడిది ?

రాత్రి రెండుజాములయ్యెను. ఆనందరావుడాక్టరు తాను కోరికతోఁదెచ్చికొనిన మణిపేటికను తన శయ్యాగారమున నున్న అద్దాలబీరువాలోనుంచి బీరువాకు తాళమువేసి తాళముచెవులుమాత్రము తాళముననే వ్రేలాడవిడిచెను. అతని శయనాగారమునకు నలుప్రక్కలగల గోడలలో గవాక్షములుండెను. ఆగవాక్షము లినుపచువ్వలతో నిర్మించబడి విశాలములైనను దుర్భేద్యముగనుండెను. ఈగవాక్షములకు పై భాగమున ఇనుపచువ్వలతో నిర్మించబడిన చిన్నచిన్న వాతాయనము లమర్చబడియుండెను. పేటికితలుపు మూతలు లేకుండెను. గదియందు నాలుగుమూలలను నాలుగు బీరువాలుండెను. ఒకప్రక్క నొకవ్రాతబల్లయు దానిముందొక కుర్చీయును నుండెను. ఈకుర్చిలో గూర్చుండుభాగమున, మెత్తనిదూదితో నిర్మించబడిన యొక తక్కాపడము చేయబడి దానిపై మృదువైనవస్త్రము పఱచబడియుండెను. దక్షిణభాగమున గోడకానునట్లు గవాక్షములనుండివిసరు మందమారుతమును గ్రహించుచందమున నొకపందిలిపట్టె మంచముండెను. దీనిపైనుండి దోమలకు నిరోధకమగునట్లుగను గాలినిమాత్రము లోనికిరానిచ్చునట్లును నల్లబడిన యొక చుట్టుతెర వ్రేలాడుచుండెను. ఈ తెరకొకప్రక్క నొకచీలిక కలిగి అవసరసమయములయందు విడిచేసి లోనబండువాడు వెలుపలకువచ్చుట కవకాశము గలిగియుండెను. ఈ పెద్దగది

కప్పునకు క్రిందిభాగమున నాలుగు చిత్రవర్ణములుగల విద్యు ద్దీపముల యద్దపుబుగ్గలు వ్రేలాడుచుండెను.

ఆనాటిరాత్రి యీ విద్యుద్దీపములు వెలిగింపబడి యుండలేదు. ఒక మైనపువత్తిగల జేదీపముమాత్రము సన్నగ వెలుగుచుండెను. ఈ గదికొకమూల నవసరసమయముల యందు నీరుపోయునెడల బయటికి బోవుమార్గముగల యొక చిన్నగది నిర్మించబడియుండెను. విశాలశయనాగారమునుండి దీనిలోనికి వచ్చుమార్గమున నొకదట్టమయిన మైనపుబట్ట తెరమాత్రము వ్రేలాడుచుండెను. ఈ రెండుగదులలో నుండు వారు ఒకరినొకరు చూచుటకవకాశము లేనివిధమున నా తెఱ ఏర్పఱుపబడియుండెను. ఈచిన్నగది కప్పు కట్టెలతో నేర్పఱుప బడి దానిపై బెంకలతో గప్పబడియుండెను. ఒకప్రక్క- సామాన్యపుచెక్కలతో జేయబడిన పెద్దపెట్టెయుండెను. దీనిచెక్కలు జాజికాయవ్రూకునకు సంబంధించినవగుటచే, పెట్టెచాల తేలికగానుండెను. ఐనను దీనివైశాల్యము ఒక మానవుడు కూర్చున్నచో భరించునంతటిగానుండెను. దీని ముందుభాగమున నొకతాళమువైచుటకు దగినగొళ్ళెమును, ప్రక్కలయందు బట్టియెత్తుటకు నవకాశముగూర్చు నినుప వంకలును, నుండెను. దానిచెక్కలు బరువున వదలకుండునట్లు, సన్నయినుపరేకులతో భద్రము చేయబడియుండెను. పెట్టె యందంతటను నెఱ్ఱనిరంగు వేయబడియుండెను.

ఆరేయి జాముప్రొద్దు గడచినయంత డాక్టరు ఆనంద రావు, ఆహారమునుభుజించి యించుకతడవు విరామము తీసికొని మరి అరజాము దాటినతరువాత మెత్తనిపఱుపుగల

తన పందిలిమంచమున బండుకొనెను. మలయమారుతము చల్లగా వీచుచుండుటచే, ప్రొద్దెల్ల శ్రమచేసియున్న వైద్యుడు గాఢముగా నిద్రించుచుండెను. రెండుజాములు దాటిన వెంటనే, పాండురంగడు ముగ్గురు సహచరులతో సాగుధుపై యానందరావు గృహసమీపమునకు వచ్చెను. వేగువాడు తాను దొలుతనే పరిశీలించుకొని యుండుటచే, చిన్నగదిపై ని కప్పుపై కిరువుర నెక్కించెను. వారు నిశ్శబ్దముగ చిన్నగదిపైని కప్పుదీసిరి. వారిలోనొకడు అల్లనలోనికివొంగిచూచి వైద్యుడు గాఢముగ నిద్రించుచుండెనని గుర్తించెను. ఒకడు లోనికిదిగి, పెద్దగదితలుపును మెల్లగదెఱచెను. పాండురంగడు లోనం బ్రవేశించి గదియంతయు బరిశీలించి జాజిచెక్కల పెట్టెను సైతము చూచెను. గదిలో మఱెవ్వరును లేకుండెను. ఈ గది లోనుండి భవనములోనికి గలత్రోవను గట్టిగామూసెను. ఒక యరనిమిషమున, దనయొదనున్న మత్తుమందుసీసాను డాక్టరు ముకుపుటంబుల యొద్దనుంచి, దోమతెరను బైకివిసరి తన చేతికత్తితో నతనిని బరలోకమునకు బంపెను. నలువురును గలగూడి, యాతనిమొండెమును, విడివడినతలను, చెక్కల పెట్టెలోపెట్టి, బీరువాలోనున్న గొన్నిబట్టలను దానిలోగప్పి పెట్టెకు దాళముబిగించి, యనుచరుల స్వాధీనముచేసెను. దీపపువెలుతురున బ్రకాశించుచున్న సువర్ణమణిపేటికను, బాండురంగడు గ్రహించెను. మూడునిమిషముల కాలమున నీఘోరహత్యను ముగించి, తిరిగి, తలుపులు చేరవైచి, నలువురును బురబాహ్యప్రదేశమునకు జేరిరి. పాండురంగడా సమీపమునగల యొకపల్లపుప్రదేశమున గూరుచుండి తన

కరదీపికను వెలిగించి, జేబులోని మషీరసయుక్తమగు లేఖనిని, పత్రిమునుదీసి, రెండునిమిషముల కాలములో మనోహరరావు పేర నొకయుత్తరమువ్రాసి, దానినిమడిచి, మఱియు దాని పైన మనోహరరావు ఫతేదారుకు జెందవలయునను పైవిలాసము వ్రాసి యొకదారముతో దానిని దాళమువద్ద గట్టిగా గట్టివైచెను. మఱియొకచీటిపై మనోహరరావు పైవిలాసము వ్రాసి ఈ పెట్టెయతనికి జెందునట్లుగను, పైభాగమున నంటించెను.

పాండురంగడు సువర్ణమణి పేటికను భద్రపఱచుకొని, యనుచరులతో తననివాస గుహామందిరమునకు బోవుచుండెను. కొంతిదూరముబోయి యా చోరచతుష్టయము తమ దుస్తులను మార్చుకొని, పాంధులవలె బిరబిర నడచిపోవుచుండిరి. రేయి మూడవయామము మీఱునంతవఱకు, తమ గుహామందిరమునకు ఒక మైలుదూరమునగల యొక పెద్ద వటవృక్షముజేరి, మార్గాయాసము దీర్చుకొనుటకై దానిక్రింద నున్న శిలావేదికపై యించుకతడవు కూర్చుండి విశ్రాంతి దీసికొనుచుండిరి. ఆ వటవృక్షమునకు రెండవప్రక్కనున్న మఱొకశిలావేదికపై, యింతకుమున్నె చేరవచ్చిన, యిద్దరు బాటసారులు నిదురించుచుండిరి. చోరులు పరువు పర్వునవచ్చి యాయాసముతో నందుజేరునప్పుడు వృక్షముక్రింద నావలి ప్రక్క బండియున్న పాంధులను జూడలేదు. కొంచెము తడవైనపిదప పాండురంగడు తన యనుచరులతో సంభాషణము ప్రారంభించెను. వీరిమాటలయలికిడికి బాంధులు నిదురమేల్కాంచియు గన్నులు తెఱవక, బట్టలు మెయినిండ

ముసుగులుపెట్టికొని మెలకువతోడనేయుండి, చోరుల సంభాషణము నాలకించుచుండిరి.

పాండురంగడు:—“ఈనాడు మీరుచేసిన సాహస కృత్యము నాకు మనోరంజకముగా నున్నదని, యనుచరులతో ననెను. అందులకు వారిలోనొకడు “దేవరా! ఇంతయేకాదు. మీయనుజ్ఞయైనచో మీశత్రులైన ఫతేదారుని యిల్లు దోచుకొని వానినిగూడ స్వర్గలోకమునకు బ్రయాణము జేయించుమన్నచో, మీయాజ్ఞ నెఱవేర్పగలమనెను. మఱి యొకడు “దేవరా! మీయనుచరులమగు మేము సామాన్యులముకాము, ఇట్టి యానందరావులను మఱినలుగురను ఒక్కనాటిలో తుదముట్టింపగలమనెను.

మూడవవాడును మిగుల ప్రోత్సాహ పూరితుడై, ఈనాడు మీరుసంగ్రహించిన సువర్ణమణిపేటికకంటె పలు రెట్లు అధికమూల్యముగల పదార్థములను మీకు దెచ్చి యియ్యగలము, మా సామర్థ్యమునంతయు మీరు రుచి చూడవలయుననియు, యుద్దేశించితిరేని, రెండుదినములలో దోపిడులుచేసి ఒక లక్షరూపాయిల విలువగలయాస్తిని సొమ్మును మీ కప్పజెప్పగలమనెను. పిమ్మట పాండురంగడును నత్యుత్సాహముఁజెంది “సరియే మీరింతవఱకు మీశక్తికొలది నాకు దోడ్పాటుసేసితిరి. కాని యింకను నాకొక్కకోరికగలదు. ప్రభాకరరావును దోడుసేసికొని, మనోహరరావు ఫతేదారు మనకుహానిసేయ నుంకించుచున్నాడు. వారిప్రయత్నములు కొనసాగకపూర్వమే మనము వారిని జిక్కించుకొనవలయునని నొక్కివక్కాణించెను.

మెలుకువతోనుండి వీరిమాటలెల్ల స్వచ్ఛముగా నాలకించినవారు కేవలము బాటసారులుకారు. వారే మనోహర ప్రభాకరులు. వీరే తస్కరులనియు నందున్నవాడే పాండురంగడనియు వారుగ్రహించిరి.

వెంటనే మనోహరరావు తుపాకిదీసికొని తస్కరులపైగాల్చెను. ప్రభాకరరావుగూడ వారినలువురివంకగా రవ్వలనింపిన దూపాకిగాల్చెను. చీకటి సనుమునుగుటచే వారి వ్రేటులు నలుగురిలో నెవ్వరికిని బ్రాణహానికాలేదు. తస్కరులును నాశ్చర్యకారకములైన యీ తుపాకివ్రేటులకు దిగాలునలేచి, యంతకుముందే సిద్ధపఱుపబడియున్న తమ మరతుపాకులతో నొక్కుమ్మడిగాగాల్చిరి. ప్రభాకరరావుకు కాలిమీద నొకరవ్వదగిలి కాలు ఇంచుక దుర్బలమయ్యెను. మనోహరరావు కుడిచేయిదండకొక రవ్వదాకి తుపాకి తిరిగి ప్రేల్చుటకు వీలులేకపోయెను. శతృపక్షము బలకరముగానున్నదని మనోహర ప్రభాకరులు చీకటిపాటున మెల్లమెల్లగ వెనుకడుగువైచి, వెనుదిరిగి చెట్లు చాటుచేసికొనుచు నెడమయిపోయిరి. పాండురంగనిరాక కెదురుచూచుచున్న యనుచరులు కొందఱు తోవవెంటవచ్చి వానిని గలిసికొనిరి. సంఘము బలవంతమైనదనియు నదనుమించినపని చేయరాదనియు నాలోచించి, మనోహరరావు ప్రభాకరునితో నగరమువైపునకుం బ్రయాణముసేసి ప్రభాతసమయమునకు సురక్షితముగా ప్రభాకరరావుతో నిల్లుసేరుకొనెను. పాండురంగడు శతృవులెచ్చటను గనబడమి, యనుచరసమేతుడై

గుహామందిరమునకుఁ బోయెను. మఱియొకగడియకాలమునఁ భాస్కరుడు తన సారథియగు ననూరుని ముందునకునడుప, బ్రాచీదిశ యరుణమయ్యెను.

---

# 7. కీడులో మేలు

విజయలక్ష్మికి సహాయముచేసి నిర్బంధావాసమునుండి వెడలించు మానవుడెవ్వఁడును నగపడలేదు. క్రౌర్యము నే బూనినయెడలఁ బాండురంగ డొక్కగడియలో నామె మానమునుగాని, ప్రాణమునుగాని హరించుటకు నవకాశము లుండెను. మాయోపాయములచే నింతవఱకెట్లో తనశీలమును రక్షించుకొనినది. ఈసమయమున దన్ను వరించి తనకై వస్త్రప్రేషణముచేసి పాణిగ్రహణము చేసికొన సిద్ధపడియున్న యువకునిజాడ యామెకు దెలియలేదు. తనపరిస్థితినిగుఱించి నియమితమనస్కునకు దెలియజేయుటయైనను దనవిధియై యుండి యట్టియవకాశ మింతవఱకును లభించియుండనందుల కామెయెంతయో పరితపించుచుండెను. ఎట్లైనను బుద్ధిబలమునకు దేహబలము సరిరాదని యామె దృఢవిశ్వాసము. ఆచోరులలో నొక్కనికి తగుసమయమున నాహారాదుల

నిచ్చుచు, సమయోచితములగు ప్రియోక్తులను జెప్పుచు, వలయుపదార్థములనిచ్చుచు, నాతనికి దనయందు నాదరబుద్ధి గలుగునట్లు చేసికొనెను. క్రమక్రమముగ నామె తనయాభిజాత్యాదులను దెల్పుచు నాతనిని తన ప్రత్యేకభృత్యునిగా జేసికొనెను. మఱియు బాండురంగడును ననుచరులును దోపిడులు సేయుట కాయాప్రాంతములకు బోవునప్పుడు విజయలక్ష్మికి సహాయభూతుడుగా నుండుటకు ఈ భృత్యుని దప్పక తనయొద్ద నుంచు నేర్పాటు చేయబడెను. ఈతని పేరు పరశురాముడు. ఈతనిచేత నెల్లవేళలయందును నొక గండ్ర గొడ్డలి యుండెడిది. చిరకాలము నుండి యతడు పాండురంగనికి ప్రియసేవకుడగుటచే, బాండురంగడితనియందు దృఢవిశ్వాసము గలిగి యుండెను. ఇతడు దొంగయు దోపిడిగాడును నైయున్నను, భూతదయా పరీతహృదయుడై యుండెను. ఇతడొక క్షత్రియవంశమునబుట్టి, తలిదండ్రులు శైశవముననే మరణించి యుండుటచే, నాయా మిత్రగృహములయందు బెరిగి బాల్యమున గొన్నిప్రాంతములయందు గొందఱి యజమానుల యింట్ల దాస్యము సేయుచు గొంతకాలము నడపి తుదకు వేసారి, జీవనోపాయములేక దొంగలజట్టులో చేరెను. రంగడీతని నొక దోపిడిసమయమున గలసి, మంచిమాటల చేతను లంచమునిచ్చెదనను వాగ్దానముచేతను, నొడంబఱచి, స్వాధీనము సేసికొని, తన గుహామందిరమునకు జేర్చి తన యనుచరులలో నొక్కనిగా నుండునట్లు సమ్మతింపజేసి, గుహామందిరమును ఎల్లవేళల గాపాడుచుండునట్లు నియమించెను. కాలక్రమమున పరశురాముడు పాండురంగనికొక స్వతంత్రి

సహచరుడై, మంత్రివంటివాడై మెలంగుచుండెను. వంశ సాంప్రదాయము ననుసరించి, శౌర్యసాహసములును, భూత దయయును, నీతనిహృదయమున దాపుసేసికొని యుండుటచేం గొలఁదిదినములనుండి, ఇట్టు ఈదుర్వృత్తిస విడనాడి ఈ సంఘమునుండి దూరగుడు కావలయునని యత్నించు చుండెను. కాని పాండురంగని యనుమతిలేక యెందుబోయి నను, దనజీవితమునకు భంగముగలదను సంశయవిచారములచే నందే యెట్లో కాలక్షేపము సేయుచుండెను.

విజయలక్ష్మియు, బరశురాముడును రహస్యమయ ములయందు జేసికొనుచుండిన సంభాషణములలో దమ క్షత్రియవంశ జననముల నొండొరులకు దెలుపుకొని, యెట్లైని యీ నిర్బంధావాసమును దొలగించు కొనవలయునని మాత్రము నిశ్చయించుకొనియుండిరి. పరిసరప్రాంతమున కెప్పుడైన విజయలక్ష్మి విహారార్థమరుగునప్పు డీతనిమాత్రమే వెంటనిడుకొని పోయివచ్చుచుండెడిది. పాండురంగ డీమెను నిర్బంధించి యామెపై ప్రేమహృదయమును బెట్టుకొని యుండెనని తెలిసికొని నప్పటినుండియు, నీమె క్షత్రియకన్యక యని, యెఱింగినప్పటినుండియు, నీతనికులాభిమానము, శౌర్య సాహసములకు బదను బెట్టినది.

విజయలక్ష్మియు స్వకులాభిమానియు, సాధ్వీ మాన రక్షణ తత్పరుడును, భూతదయా పరతంత్రుడును, శౌర్య సాహసాది గుణశాలియునగు నొకవీరపురుషుడు తనకు తోడు వాడోడుగా లభించినందులకెంతయు సంతసించుచు, నప్పటి

కై నను, బరశురాముని సాహాయ్యమున దాను విమోచన పొందగలనను ధైర్యముతో, దిగులువిడిచి దినములు పుచ్చు చుండెను.

పాండురంగడు సువర్ణమణి పేటికను దీసికొనివచ్చి, యానంద పరవశచిత్తముతో విజయలక్ష్మికిజూపి, "కోమలీ! ఇదిగో! నీ ప్రథమనియమము దీర్చితిని. నీవుకోరిన మణిపేటిక యిదియేనా చూచుకొమ్మ"ని యామె ముందుంచెను. పరశురాము డామెసమీపముననే యున్నవాడగుటచే, మణి పేటికను గ్రహించి, రంగనితో నిట్లనెను :—అయ్యా! తమరు శ్రమచేసి మణిపేటికను దీసికొనివచ్చితిరి. కాని యామె నియమము "తనయుంగరమును జేతిగడియారమును జూప వలయుననిగాని, కేవల మణిపేటిక గావలయుననియేగాదు. ఈపేటికను దెఱపించి, యందు నుంగరమును, గడియారమును నున్నయెడల వానినిదీసి యామెకొసంగి, ఒకనియమము దీర్చితిమని చెప్పుట యుక్తము."

పాండు:—"తొలుత, మణిపేటిక యిదియేనని నిశ్చ యించుట అవసరముగదా"

పరశు:—"పేటికనుజూచి యిదియేయని యెట్లు నిర్ధారణ చేయవచ్చును? పేటికనుబోలిన పేటిక మఱియొక్కటి యుండ గూడదా! పేటికనుదెఱచి యామెయుంగరమును జూపునంత వఱకును నానియమము చెల్లినయట్లు కాజాలదు."

విజ:—నా నియమమునే మీరు పాటింపదలంచినచో నాకు "సంగృహీతమును ఘటికాయంత్రమును జూపవల యును. నా నుడివిన నియమములోని భావము, ప్రధానమునకై

యంపబడిన పదార్థములనుజూచి, వానిని తిరుగబంపి, ప్రధానమును వైయర్థ్యము జేయుటగాని కేవల మణి పేటికా సందర్శనముకాదు."

పాం:_"దీనిని బగులగొట్టినచో నయ్యది బైటపడకూడదా?"

పర:_ఒకరుపంపిన విలువగలపదార్థమును చెడగొట్టి, తిరిగి వారియొద్దకేపంపుచు "నిదిగో మీద్రవ్యము"ని చెప్పుట ఎంతపాటిధర్మము?"

ఆవిధముగ ప్రసంగముసేయుచు, తుదకు స్వర్ణమణి పేటికను దెఱచి చూడవలయునని నిశ్చయించిరి. కాని దానిని విరుగగొట్టరాదనియు దీర్మానింపబడినది. అప్పుడు పాండురంగడు దానిని దెఱువవలయునని యెంతయో ప్రయత్నించెను. పేటికను అనపాయముగా దెఱచుమార్గము వారికి లభింపలేదు. పాండురంగడు ముందటి కర్తవ్యమునుగుఱించి యోజించుచుండెను.

# 8. ప్రజోపకార నిశ్చయము.

భీమనగరమున ప్రజలెల్లరు సూర్యోదయ సమయమున దమతమ కార్యనిర్వహణములయందు నాసక్తులై యటునిటు తిరుగాడుచుండిరి. కొందఱు పురమువెలుపల బడియున్న జాజి కాయపెట్టెనుజూచి, యిదియేమని దానిదగ్గరకు బోయి చూడగా దానిపైనొక విలాసపుచీటియును, ప్రక్కపాటున గట్టబడిన యొక కాగితపుసంచియు నగపడెను. రెండును మనోహరరావుపేరున వ్రాయబడియుండుటచే నొకడుపోయి పరిశోధక కార్యాలయమునఁ జెప్పెను. వెంటనే యిరువురు రక్షకభటులు పురమువెలుపలకుబోయి, పెట్టెయున్నతావుజేరి దానినెత్తికొని, కార్యాలయమునకు దీసికొనివచ్చిరి.

మనోహరరావాసమయమున గాగితముల చూచుకొనుచు, కుర్చీపైకూర్చుండి, ప్రక్కనున్న ప్రభాకరరావుతో సంభాషించుచుండెను. పెట్టెను బెట్టి ప్రక్క వ్రేలాడు కాగితపు సంచినిజూచి తనకుజెందునట్లుగా వ్రాయబడిన యక్షరములను జదివి, దానిమూతిఁజించి యుత్తరమును బైకిలాగుకొనియెను. దానిని విప్పిచూడ నందందు రక్తపుమరకలు గనబడెను. అందలివిషయము నిట్లు చదువసాగెను.

"ఓరీ మనోహరరాయా! నీ వృత్తాంతమంతయు నాకు దెలియును. నీవు ప్రభాకరరావు సాయముతో నన్నుబట్టి బంధింపవలెనని యత్నించుచున్నావు. నీవంటి పరిశోధనాధి

కారు లెందులో నాముందు గతించిరి. దొంగలపాండురంగని బట్టుట సామాన్యవిషయముగా దలంచి మోసపోవుచున్నావు. ఆనందరావునుజంపి వానిశవము నీపెట్టెలోనునిచి నీయొద్దకు జేరునట్లు చేసినవాడను నేను. నీకును నిద్రావస్థ పట్టునని తెలియజేయుటకు ఈ కళేబరమును నీయొద్దకంపినాను. దాని వలన నా శౌర్యక్రౌర్యము లెట్టివో గ్రహింపుము. నీకు భార్యా పుత్రులయందు మోహముండి కొంతకాలము భూమిపై దిరుగవలసిన దినములున్నవని తలంచినయెడల, నన్ను వంచింపవలయునను నభిప్రాయము వదలుకొనుము. ఏపాపమూ నెఱుగని ప్రభాకరరావును పరిశోధనోద్యోగమున నియమించి, నీకు ద్రోహముచేసికొని యగ్నిముఖమున ద్రోయుచున్నావు. మీరిరువురును దెబ్బలుతిని పాఱిపోయినవిషయము నాకు దెలియును. ఆనాడే మృత్యుదేవత మీకాహ్వానమిచ్చెడిదిగాని మీ యిరువురకును బ్రదుకుదినములింకను మిగిలి యున్నవి. ఇప్పటికైనను బుద్ధితెచ్చుకొని నీగంజిసీరు నీవు త్రావుచు బాండురంగని తెరువునకు రాకుము. నీయందలి ప్రేమతో నీవింకను గొన్నినాళ్లు బ్రతుకవలయుననునిచ్ఛతో వ్రాయుచున్నాను."

పాండురంగడు.

మనోహరరా వీయుత్తరమును జదువుచునే నిర్విణ్ణుడయ్యెను. ఆలోచనతత్పరుడై, ప్రభాకరునివంక జూచెను. అంతలో రక్షకభటులు ఆజ్ఞనొంది, పెట్టె తెఱచిచూపిరి. మృతకళేబరమును గన్నులారఁజూచి పరిశోధకు లిరువురును

దయార్ద్రి హృదయులగుటచే, గన్నీరుగార్చి, జేబుననున్న చేతిరుమాలతో గన్నులను మోములను దుడిచికొనిరి. ఉభయులకును నంతరంగములయందు మహాగ్రిహ ముత్పన్న మయ్యెను.

అంతలో నానందరావుకుమారుడు బిరబిరవచ్చి, పెద్ద పెట్టున రోదనముసేయుచు, మనోహరరావు పాదములపై బడెను. మనోహరరావు వానినోదార్చి యా మృతకళేబరము గల పెట్టె నాతనికి స్వాధీనముసేసెను. కొందఱు సేవకుల సాహాయ్యమున నానందరావు మృతకళేబరము నాతనికుమారుడు దహనసంస్కారమునకై తీసికొనిపోయెను.

కొంతతడవు విచారించినపిదప, మనోహరరావు, ప్రిభాకరరావుకు రహస్యముగా శాండురంగని బట్టుకొనువిషయమై యేమో ప్రసంగించెను. ప్రభాకరరావు అందులకు నంగీకారము చూపుచు నీయుపాయము చతురముగానున్నదని శ్లాఘించెను. పదంపడి మనోహరరావుయొక్క యానతిగైకొని, ప్రభాకరరావు నిజనివాసమున కరిగెను. హేలావతి తనయునితో నిట్లు ప్రిసంగించెను.

"ప్రిభాకరా! నీవు నీకృత్యములయందెట్లు మెలఁగుచుంటివోగాని, కడుజాగరూకుడవై సంచరింపవలయును."

"మార్త్యునకు మరణములు రెండులేవు కానున్నది కాకపోదు. సర్వేశ్వరుడనువాడొక్కడు ధర్మాధర్మములను బరిశీలించుచునే యుండును. బ్రిదికియు కొందఱు చచ్చినవానివలె బ్రివర్తింతురు. అట్టిచావు నన్నుజేరజాలదు."

"ఈ వైరాగ్యము తరుణమున నక్కఱకురాదు. పాండు రంగని జట్టువలన మనమొకసారి మోసపోయితిమి. నీవొకసారి మరణించి బ్రతికితివి. అతని మాయోపాయములను గను గొనుట దుస్తరము. ఇంచుక యేమఱియుంటిమేని యతడు ప్రాణములను హరించును. నీకనుభవమైన విషయమగుటక నేనంతగాఁ జెప్పదలఁచుకొనలేదు."

"అమ్మా ! నీవు వీరసాధ్వివి! పీతమాతవు. ప్రపంచ మునఁ బలువురయిండ్లు దోఁచుకొనుచు, బలువురప్రాణములను హింసించి వధించుచున్న దురాత్ముని బట్టి యంతమందించుట ప్రజోపకారమైనసంగతి. కావున నేను బూనుకొను నుద్యమము నుండి నన్ను విముఖునిజేయుట గొప్పవిషయము కాదు. కర్తవ్యాంశమున నేమని జెప్పినచో శిరసావహించి నీయాన సెలవేర్చెదను."

"మంచిది. నామాట వినకున్నను, నీ ప్రత్యర్థియగు పాండురంగనినుండి, నీపేరవచ్చిన యీ యుత్తరమును జదువు కొనుము. తరువాత నీకర్తవ్యమును నీవేనిర్ణయించుకొనుము" అని హేలావతి కొమరునిచేతి కొకయుత్తరము నొసంగెను. ప్రభాకరుడా యుత్తరము నీవిధముగా చదువసాగెను.

"ప్రభాకరరాయా! నీవు చిన్నవాఁడవు మనోహర రావు మాటలువిని పరిశోధనశాఖలోఁ బ్రవేశించినావు. నీవలన నేమికాగలదు. నిన్నడ్డముపేసికొని, సమయము వచ్చినప్పుడు నీప్రాణముల నొడ్డుపెట్టి మనోహరరావు తనకార్యము సాధించుకొని, యుత్తమాధికారపదవిని సాధింప యత్నించుచున్నాఁడు. నీ వొకటిరెండుపర్యాయములు పాండు

రంగని, శౌర్యసాహసములను జవిచూచియున్నావు. అయినను నీమనస్సును నీవు త్రిప్పుకొనలేదు. పాండురంగని కపటాచారము సేయు నభిప్రాయముతో సంచరించుచు, మనోహరరావు దురోభఘను లోఁబడితివేని, తొలుతనీవు, నీ ప్రాణములయం దాశవదలుకొనుము. నీ తలిదండ్రులకు గడసారి వందనము చేసిరమ్మా.

పాండురంగడు.

ఈ యుత్తరమును జూచునపుడు పాండురంగని దౌష్ట్యము, ప్రభాకరుని హృదయసీమను దాకినట్లయ్యెను. "ప్రపంచమున మానవజన్మనెత్తినవాడు ఇట్టి లోకకంటకుని బరిమార్చి తనజీవితము సార్థకరించుకొనవలయును. ఇట్టివానిని బట్టి కరములను, పాదములను నఱకి, పెద్దబజారులలో నూరేగింపు సేసినచో, నిక దోపిడి దొంగతనము అనునవి పేరునకు నిలువవు. కావున నిట్టిదురాత్ముని బట్టితినని పేరైనను బొందవలయును. కాదేని యిట్టిక్రూరుని బట్టుకొనునుద్యమమున మరణించితినను యశమైనను బొందవలయును." అని ప్రభాకరుడు తనమనస్సున దృఢనిశ్చయము సేసికొనెను.

అంతట గొంతతడవునకు దనతల్లియగు హేలావతితో లోగృహమునకుబోయి, బిరబిర రెండుకబళములను మ్రింగి, యుద్ధమునకుబోవు సైనికునివలె త్వరసేసి, యాహారస్వీకారమును ముగించెను. నీవు ఇసుమంతయు భీతిజెందక యాశీర్వదించి పంపుమని తల్లియనుజ్ఞను గోరెను. హేలావతియు, దప్పనిసరియని భావించి, కుమారుని మూర్ధాఘ్రాణముసేసి

ప్రభాకరుని సాగనంపెను. ప్రభాకరరావు, ఉద్యోగియు మస్తులను నాయుధములను నొకశతఘ్నిని గ్రహించి, యిరువు రనుచరులతో నడిరేయి నెచ్చటికో బయలుదేరి పోయెను.

---

# 9. అశ్వనిర్మాణము.

భీమనగరమునకు నుత్తరప్రాంతమున ననతిదూరమున నొకపెద్ద యేటికాలువగలదు. దీనిలో ననారతమును వర్తకులును, బాటసారులును పడవలపై బ్రయాణము చేయుచుందురు. దీనిలో ననేకములైన యుపప్రవాహములుబుట్టి యావలీవలనున్న వరిపొలములకు నీరుపాఱుచుండును. ఆకాలువ కిరుప్రక్కలనుగల వరిపొలము లనవరతము సస్యశ్యామలములై రెండుకారులు పండుచుండుటచే, నచ్చటి ప్రజలు సుఖజీవనులై యుందురు. ఈకాలువ అతివేగముతో బ్రవహించుచుండుటచే, సామాన్యముగ శక్తిహీనులగు వారెవ్వరును దీనిలోనీదుకొని పోవజాలరు. ఇచ్చట నొక్క బల్లకట్టుఉండి, రేయింబవళ్లును బాటసారులను నావలినుండి యీవలకును నీవలనుండి యావలకును జేర్చుచుండును.

ఈ యేటి కాలువకు ఆవలి ప్రక్క ననతిదూరముననే, రామనగరము, సీతానగరము మొదలగు నగరములుండును. ఈ ప్రాంతములో చౌర్యము చేయించుటకొఱకు పాండు రంగడు జట్టుతో బయలుదేరి నిశివేళ నీకాలువదాటి పోవు చుండును. ఒక్కప్పుడు ఈవలకుదాటి వచ్చుచుండును.

మనోహరరావు దూరదృష్టితో, భీమనగరమువద్ద నున్న చెఱువులోను, ఈ ఏటికాలువలోను నప్పుడప్పుడు ఈత నభ్యసించుటకై, పోవుచుండెను. కొన్నిదినముల కత డొకపెద్ద యీఁతగాడుగా సిద్ధమయ్యెను. ఏటికాలువ నొక్క పర్యాయము ఈదుకొనిపోయి తిరిగి యీదుకొని రాఁగలిగి నంత సామర్థ్యమును సంపాదించికొనియుండెను. పదంపడి మనోహరరావు ప్రభుత్వమువారి యనుజ్ఞచే నొకచిన్న జలాంతర్గామిని దెప్పించెను. దాని నీకాలువకొకప్రక్క లోతైనస్థావరమున నెప్పుడును నుండునట్లును అవసరసమయ ములయందు నుపయోగపడునట్లును నేర్పాటు చేసియుండెను. మనోహరరావు ఈ జలాంతర్గామిని నడుపువిధానమును బూర్తిగా నేర్చికొనియుండెను. పాండురంగడు తనసామర్థ్యము చేత వివిధప్రాంతములయందు దోపిడులుజరుపుచు మిక్కుట ముగ ధనాదుల నార్జించెను. ఎప్పటివర్తమానమప్పుడు విజయ లక్ష్మి తెలిసికొని, తనయొద్దనున్న చిన్నిపాత్రమున, దిన క్రమమున బాండురంగని చర్యయంతయును వ్రాసికొను చుండెను.

భీమనగరమున నొకనేర్పరియగు శిల్పకారుడుండెను. అతడు వీరభద్రుడను పేర గిలువబడుచుండెను.

విజయలక్ష్మి సాధారణబుద్ధికి గోచరముగాని యొక పదార్థమును సృష్టించి దానిసహాయమున నస నిర్బంధ నివాసమును బాపుకొనవలయునని సంకల్పించెను. పరశురాముని బిలచి యొకతటి నాతనితో నిట్లు సంభాషించెను.

"అన్నా! నాకొక చిన్నయుపాయము తోచుచున్నది. దానిని నీవంగీకరింపవలయును."

"సోదరీ! నీవు చెప్పినప్రకారము చేయుటకు సర్వదా నేను సంసిద్ధుడను, అదియేమో తెలుపగలవు."

నీకుగావలసిన ద్రవ్యమును నేనొసంగెదను. భీమనగరమున వీరభద్రుని యింటికిబోయి ఒక కొయ్యగుఱ్ఱమును జేయింపుము. దానిగర్భమున బదిమంది గూర్చుండగలిగి నంతటి వైశాల్యముతో దానిని నిర్మింపజేయుము.

దానికి నాలుగుప్రక్కలను విశాలములైన కంతలును వానినిమూయదగిన చెక్కలును, చెక్కలకుదగిన గడియలును నుండునట్లు చేయవలయును. గుఱ్ఱమునకునేర్పడు నాలుగు కాళ్ళక్రిందను చక్రములుండవలయును. మెడ నటునిటు ద్రిప్పుటకు దగిన మరలుండవలయును. అశ్వగర్భమున నిమిడింపదగిన మఱికొన్నిపదార్థములున్నవి వానినినీకు దర్వాత జెప్పెదను."

"నీవుచెప్పకయే దానిని నేను గ్రహించినాను. ఒక శతఘ్నినుంచుటకు దగినవేదిక నేర్పాటు చేయించవలయునని నీ యభిప్రాయముగాదా?"

"అవును. కాని నీవావిషయమును గడురహస్యముగా నుంచవలయును."

"అందులకు సందియము లేదు. వీరభద్రుడు చెక్కలు మున్నగు పదార్థములను వికృయము నొందుటకు గొంత సామర్థ్యము వలయునుగదా ?

"ఇదిగో ! రొక్కము."

అంత నతఁడొకబిచ్చగాని వేషము వేసికొని రొక్కమును భద్రపఱచుకొని, భీమ నగరమునకు ప్రయాణోన్ముఖుడయ్యెను. విజయలక్ష్మి యాసమయమునఁ బరశురాముని జూచి, "వేసము సరిగానున్నది. కాని నీ వొక్కయుపాయమునన్ని రావల యును. ఈదారు తురంగము నా వీరభద్రునియింటనే జాగ్రత్త పఱచి యుంచునట్లు లేర్పఱచి, కోరినప్పుడు ఉపయోగమునకుఁ బంపవలయునని వానికి జెప్పుము. నీవాతనితో పరిశ్రమము నెలగా ఖండించుకొనిన మొత్తముకంటె నిరువదిరూపాయిల నధికముగానిమ్ము. మఱియేమైన నశ్వమున వృద్ధిచేయవలసి వచ్చినచో వెంటనే చేసియియ్యవలయునని చెప్పుము. ఏనిమిషమున మనముకోరినను, రేయియనక పవలనక ఇచ్చి వేయవలయుననియు మఱలనందుంచినచో నట్లుంచి కాపాడ వలయుననియు జెప్పుము. ఇఁకఁ బోయిరమ్మని యనుజ్ఞ నొసంగెను.

పరశురాముడు తెలవారుజామున నొంటరిగ బిచ్చగాని వలె బయలుదేరి భీమనగరమునకుబోయి, వీరభద్రునిఁ గలిసి కొని దారుతురంగమును జేయజెప్పి రెండుదినములలో సిద్ధ పఱచి, యతనియొద్దనే యొకయరలో భద్రపఱచియుంచెను. రెండవనాటి సాయంకాలమువఱకు గుహామందిరమునకువచ్చి యావార్త విజయలక్ష్మికి వినిపించెను. పరశురాముని కార్య

నిర్వహణశక్తికెంతయు సంతసించి, యాతని నెంతయు శ్లాఘించి "పరశూ! నీవు మఱియొక చిన్నకార్యమును సాధించినచో మనయుభయుల నిర్బంధవిమోచనమును నతిశీఘ్రముగ సమకూడగలదు." అని సంభాషించెను. పరశురాముడు "అక్కా! నీకేల యీసంశయము. నీవేకార్యముసెప్పినను నిర్వహించెదను. తప్పక యానతిమ్ము." అనెను. అప్పుడు విజయలక్ష్మి లేఖనిం జేబూని యొక్కయుత్తరముఁ వ్రాసి యీవిధముగా జదివి వినిపించెను.

భీమనగరం ప్రభాకరరావుకు.

ప్రియవల్లభా!

నీవు నన్ను వివాహము సేసికొననెంచి, వివాహ నిశ్చయ మర్యాదాపదార్థములుగా బంపిన సువర్ణమణిపేటిక తొలుత నాకడకు జేరినది. యందున్న యుంగరమును, జేతి గడియారమును నేనుస్వీకరించి, యనుమతి సూచనముగ గొన్నినాళ్ళు ఉపయోగించితిని. పరమాత్ముని నిర్దేశమువలన వివాహముజరుగుట కాలస్యము సంఘటించినది. నేను గొన్ని దినములు నీకొఱ కెదురుచూచుచుంటిని. దైవవశమున నా యంగుళీయకమును ఘటికాయంత్రమును మణిపేటికలో నుంచి, నాయింట నొకచో నుంచగానది యెవ్వరిచేతనో దొంగలింపబడినది. పదంపడి దైవప్రేరణమువలన నాకు నిర్బంధావాసము గలిగినది. తిరిగి యా మణిపేటికనెట్లో సంపాదింపగలిగితిని. నీవంపిన పదార్థములను జూచుకొని నిన్నుగా భావించుకొని, నా యనురాగదహనము నడంచి కొనుచుఁ గాలయాపనము చేయుచున్నాను. నా నిర్బంధమును

దొలగించి నన్ను జేపట్టి, సుఖములందేల్చువిధి నీయందున్నది. కర్తవ్యతావిషయమున నీవు నేనంపుచున్న యీ పరశురామునితో సంప్రదించి, నిర్బంధకారకుని వంచించు మార్గమునకై నీవును నాలోచింపవలసినది. ఈ నిర్బంధకారకుడు నీప్రాణముల నపహరించుటకు బ్రయత్నించుచున్నాడు. నీవు అతిజాగరూకతతో మెలంగుచు, నాతడు నిన్నెదుర్కొనుటకు బూర్వమే నీవాతనినిబంధించి, నాకు విముక్తికలుగజేయ బ్రయత్నింపుము. అవసరమైన యితరాంశములనన్నింటెని నీవీపరశురామునివలన దెలిసికొనవచ్చును. త్వరపడవలయును.

ఇట్లు.

నీ ప్రియురాలు.

విజయలక్ష్మి."

ఈ యుత్తరము నొక కాగితపుసంచిలోనుంచి, భీమనగరం ప్రభాకరరావునకు జెందునట్లు పైవిలాసమువ్రాసి పరశురామునకిచ్చి యాతని భీమనగరమునకంపెను.

---

# 10. అంబపల్కు జగదంబాపల్కు

ఒకదినమున భీమనగరమున జరుగుచున్న సంత బజారులో నొక బుడబుక్కలవాడు, మేనెల్ల గుడ్డలు వ్రేలాడ, నొక యెఱ్ఱనితలపాగజుట్టి, చేతనొక్క డమరుకముబట్టుకొని, "అంబపల్కు జగదంబాపల్కు" అని ఉచ్చరించుచు నడుమ నడుమ, డమరుకమును వాయించుచు దిరుగాడుచుండెను. వీనివెనుక యనుచరుడుండెను. అనుచరునికక్ష్యమున నొక చిన్నమూట వ్రేలాడుచుండెను. బుడబుక్కలవాడు ఆజాను బాహువుగ నుండెను. అతిదీర్ఘములయిన బుఱ్ఱమీసము లతనిగాంభీర్యము నినుమడించుచున్నవి. విశాలములైన యరుణనేత్రములును, నుదుట గనుబొమలనడుమ దిద్దబడిన యెఱ్ఱని కుంకుమతిలకమును వేషమునకుదోడై యతని యంబా సేవన ప్రకృతిని ధ్రువపఱచుచున్నవి. ఈ బుడబుక్కలవాని వేషమును వానిచూపులును, విపరీతములైన జాతీయపు బలుకులును, చుట్టుప్రక్కలనున్న ప్రజల నాకర్షించినవి. కొంతతడవునకు బెక్కుమందిప్రజలు అతనిచుట్టును గుమి కూడిరి. అతనిదగ్గిరకు వచ్చినవారిచేతులుబట్టి, అఱచేయిలోని రేఖలనుజూచి "నీకు పదియేనురోజులలో గండమున్నది. నీవు అంబకుమొక్కినచో అంబ నిన్నురక్షించగలదు." అని పలు రీతుల ప్రసంగములు చేయుచుండెను. కొందఱికి గొన్ని గడచిన కష్టాదులనుగుఱించి ద్వంద్వార్థముగ జెప్పుచుండుటచే "అవును. ఇతడుచెప్పినమాటలు నిజమే" అని యంగీకారము సూచించుచుండిరి.

ప్రజలలోనుండి కొంతతడి కొకయువకుడు ముందుకు వచ్చెను. అతనికినిన్నిట్లే యాగామివిపత్తులనుగుఱించి చెప్పెను. అంబలకేమి చేయవలయునని యా యువకుఁడడిగెను. వారుభయులకును నీ సంభాషణము జరిగెను.

"బాబూ నీకు రాఁగలకాలమున జాలకష్టములున్నవి."

"ఇప్పుడుమాత్రము నేను సుఖములోనున్నానా ?"

"ఇప్పుడు నీవొకమనోవ్యాధిచేఁ గృశించుచున్నావు."

"నాకీమనోబాధ ఎందువలన గలుగుచున్నది ?"

"నీవొకకోమలిపై మనసుపెట్టియున్నావు. నీకా కోరిక దేవీసహాయమువలనగాక ఇతరమార్గమువలన సిద్ధింపదు."

"ఆఅంబ నాకు సహాయమెట్లు చేయగలదు ? ఆమె నారాధించుటయెట్లు ?"

"అంబను నేను నీకుజూపగలను. ఆమెనాయొద్ద నొక పెట్టెలో గూర్చుండియున్నది. దానిని తెఱచిచూచితివేని యంబ నీకుగనబడును. నీవు కోరినకోరికలు సిద్ధింపగలవు."

"ఇప్పుడు చూపెదవా ?"

"అట్లుకాదు. మనము ఊరివెలుపలకు బోవలయును. ఏకాంతప్రదేశమున గూరుచుండి మనము అంబను ధ్యానము సేయవలయును. పలుమందియున్నచోట అంబాధ్యానము నిశ్చలముగా జేయవీలుండదు."

"నామిత్రుడగు రాఘవరావును నేనును వచ్చెదము."

"అభ్యంతరము లేదు. అట్లేరండు."

అప్పుడు ప్రజలలో దిరుగాడుచున్న రాఘవరావును బిలచి, ఆ యువకుడు బుడబుక్కలవాని వెంట బయలుదేరిరి.

బుడబుక్కలవానికి దెలియకుండ నాయువకుడు రాఘవ రావుతో, ఏమైన మోసము కనుబడినచో నేను ఎడమచేతి నెత్తెదను. అప్పటిసమయమున కనుకూలముగ నీవు సంచరింప వలయునని చెప్పెను. అనుచరుడును వారితో నరుగుచుండెను. నలువురును బయలుదేరి యూరివెలుపలగా నొక రెండు ఫర్లాంగుల దూరముబోయి, యొక పెద్దరాతిచాటునకు జేరిరి. పదంపడి యనుచరునియొద్దనున్న మణిపేటిక నొకబట్టలోనుంచి బుడబుక్కలవాడు తనచేతనుంచుకొనెను. రాఘవరావును దనయనుచరుని గొంచెముదూరమునకు బోవనియమించెను. పిలుపునకందుబాటులో నున్నంతదూరముపోయి వారిరు వురును ముచ్చటాడుచు గూర్చుండిరి.

బుడబుక్కలవాడు సువర్ణమణిపేటికపై గల బట్టను దొలగించి యువకునకుజూపెను. వెంటనే యా యువకుడు నిర్విణ్ణచేతస్కుడయ్యెను. ఆవస్తువు మున్నుతనయొద్ద గొన్ని నాళ్లున్నట్లు గుర్తించెను. ఇది ఈ బుడబుక్కలవానికెట్లు లభించెనా? యని యాలోచించెను. కూర్చుండినచ్లోటనుండి యించుక ఖిన్నవదనుడై ఒక నిమిషమాత్రమున నీ క్రింది విధమున నూహాప్రసారము సేసెను.

"దీనిపైన నక్కరములు నేను మున్నువర్పఱచినవే కావచ్చునా? ఇట్టిమణిపేటిక మఱియొక్కటి యుండ గూడదా? ఐనను నాయొద్దనున్న మణిపేటికను ఒకకోమటికి బ్రిధానపదార్థముగా బంపియుంటినిగదా? ఈ ముష్టివాని చేతికిది యెట్లువచ్చెను. ఆమె అవసరపడి యమ్ముకొనెనా? ఆమెకంతటి యవసరమేలకల్గును? ఈమెనుండి ఈ పదార్థము

నెవ్వరైన దొంగిలించి యితరులకమ్మకొనగా, క్రమక్రమముగ నయ్యది యతనిచేతఁ జిక్కెనా ? ఈ సువర్ణమణి పేటికలో నంబాదర్శనమున కేమియర్థము ? ఇందేమియో రహస్య ముండవచ్చును. అయినను నా మణిపేటికను దొలఁతొ త్త జేతదీసికొని పరీక్షించిచూచెదనుగాక."

ఇట్లాలోచనలుచేసి యాయువకుడు "అయ్యా! ఆ దేవీ పేటికను నా చేతికొక్కసారి యొసంగుడు. అంబానివాసమైన ఈ పుణ్యపదార్థము నొక్కసారి స్పృశించి ధన్యుడనయ్యెద" నని మఃష్టివానినడిగెను. "నీవు దేవీభక్తుడవు. దీనిని స్పృశించి కన్నులకద్దికొమ్మని యతడా పేటికను యువకునిచేతికొసంగెను. యువకుడు దానిని దనజేతబట్టుకొని కదలించి లోపలనేమో ధ్వనించుటయు, దానిపై భీ॥ ప్రి॥ అను అక్షరము లుండు టయు విశదముగా గనుగొనెను. అంతకంత కతనిసందేహా మధికమై యాపేటిక తనదేయని గుర్తించియు, యేమియు దెలియనివానివలె నటించుచు దిగిగి మణిపేటికను బుడబుక్కల వానికిచ్చి యాతనిజూచి యిట్లుప్రశ్నించెను.

"అయ్యా! ఈపెట్టెలో నేమో పెట్టబడియున్నట్లున్న దేమి ? లోపలనేమో కదలుచున్నట్లున్న దేమి ?"

"అదియే అంబాజీవము. నాచేతిలోని డమరుకను వాయించిచూడుము. లోపలనేమో కదలినట్లుండును. అంబ గలతావులన్నియు నిట్లేయుండును."

"నీచేతిడమరుకము కదలించినప్పుడెంతయో ధ్వని సేయుచున్నది. ఈపెట్టెను కదలించినప్పుడు గరగరలాడు చున్నదిగాని అంతపెద్దనాదము నిచ్చుటలేదేల ?"

"జగజ్జననికి బ్రియములైన పదార్థములను మేము ప్రతిసంవత్సరాది పర్వమునను బూజించుచుందుము. ఈ పేటిక మొన్న మొన్న నే చేయించబడినది. దేవి దీనియందింకను బూర్తిగ బ్రవేశించియుండలేదు. ధ్యానము చేసినకొలంది అదియే పెద్దమోహ్రితమోగ్రిగును. ప్రస్తుతము నీకోర్కెల దీర్చుటకేమియు నభ్యంతరములేదు."

"దీనిపై నేమో యక్షరములున్న వేమి ?"

"అవి యేమియక్షరములో సరిగాజూడము. వాని కర్థము నేను చెప్పెదను."

"మొదట "భీ" అనిఉన్నది. తరువాత "ప్ర" అని యున్నది."

"భీమేశ్వరసాధ్వి" అనిఅర్థము. జగజ్జనని భీమేశ్వరుని భార్యగనుక "భీ" అని వ్రాయబడియున్నది. "ప్రళయ తాండవలోల" గనుక ఆనామమున బ్రథమాక్షరమగు "ప్ర" అను నక్షరము చిత్రింపబడియున్నది. ఆ రెండక్షరములును, జగజ్జననియొక్క నామములకు మొదటియక్షరములు. దేవి ఈ నివాసములో నప్పుడప్పుడు తాండవము సేయుచుండును."

"ఈ పెట్టెను నీవు తెఱచిచూపెదవా ?"

"ఇంచుక తడవు నీవు దేవీధ్యానము సేయుము. ఆ పెట్టెను దెఱచుమార్గము నీకే తెలియగలదు. ఇప్పుడు నాకు జగజ్జనని తగుమాత్రము చూపుట లేదు."

"అట్లయిన నిటు దెమ్మని యా సువర్ణపేటికను గుడిచేత గైకొని, దేవీధ్యానముచేసెను. ఒక రెండునిమిషములు ధ్యానముచేసి "తెఱువబడ దేమి" యనెను."

"నీవింకను ధ్యానముచేయుమని ముష్టివాడనెను."

ఇట్టును తెఱచుమార్గము తనకు దెలియదనియు, నంబ తనయందిప్పు డనుగ్రహించుటలేదనియు చెప్పిన బుడబుక్కల వానినిఁజూచి యా యువకుడు, మిగుల సంశయించెను. వానివంక నెగదిగజూచి యతడు వేషాంతరమున మోసగింప వచ్చినవాఁడని గ్రహించెను. ఆ మణిపేటికను దనకుడిచేతిలో గట్టిగాబట్టుకొని, కన్నులరవాల్చి, ధ్యానము సేయువానివలె నటించుచు, నెడమచేయినెత్తెను. ముష్టివాఁడు పాండురంగ డనియు వేషాంతరముదాల్చి, మణిపేటికను దెఱచుమార్గ మును దెలిసికొనుటకు నీ యుపాయముపన్నెనని చదువరులకు గోచరము కాకమానదు. ఈ యువకుడు భీమనగరం ప్రభాకర రావు గనుక తనయతురములను గుర్తించి, తప్పక యా పేటిక తన దేయని నిశ్చయించుకొని, దానిఁదెఱచుమార్గము పాండు రంగనికి దెలియనీయలేదు. ఈ ధ్యాననటనము పూర్తిగాక ముందే, రాఘవరావు తనకు జెప్పబడిన సంజ్ఞప్రకారము ఎడమచేయినెత్తుట మోసకారణమని గ్రహించి బిరబిర వీరుభయులున్న తావునకు వచ్చెను.

"అన్నా! చాలతడవైనది. ఇఁక బోవుదమాయనెను" వెంటనే ప్రభాకరరావు మణిపేటకను రాఘవరావుకుజూపి "తీసికొని పరువెత్తిపోవుదుమని సంజ్ఞచేసెను. ఈ సంజ్ఞ జరిగి జరుగకముందే ప్రభాకరరావు మణిపేటికతో బలముకొలది యారిష్టపునకు బరుగెత్తిపోయెను.

పాండురంగడు నిలుపు నిలుపుమని వెంటనంటగా, రాఘవరావు అతని త్రోవకడ్డమువచ్చి "సంగతియేమి చెప్పు" మని నిరోధించెను. పాండురంగని అనుచరుడు రాఘవరావుకు మాటిమాటికి నతనికడ్డము వచ్చుటవలన పట్టుకొని బంధించి అడవిలోనికి గొంపోయెను. పాండురంగడు ప్రభాకరరావును వెంటాడి పట్టుకొనలేక, నతనిపై తుపాకిపేల్చెను. కాని తుపాకిగుండు దూసుకొనిపోయెను. అంత నతితీవ్రముగ బరుగెత్తుకొనిపోయి ప్రభాకరరావు పరిశోధనకార్యాలయముం జేరెను.

కాగితములపై నేమోవ్రాయుచు గూర్చుండియున్న మనోహరరావు కీవృత్తాంతమునుజెప్పి వంచకుడూరిబైట నున్నవాడని తెల్పెను. మనోహరరావు నాదరించి కూర్చుండ బెట్టి, నలువురు రక్షకభటులను ఆత్రోవనేపోయి ముష్టివానిని బిలచుకొనిరమ్మని పంపెను. రక్షకభటులు ఊరివెలుపలకు బోవునంతనె, పాండురంగడు రాఘవరావును బట్టుకొని బంధించిన తనయనుచరునితో గలిసికొని యడవినుండి బిరబిర నడచి యెందోపోయెను. రక్షకభటులు ఆతావున నెవ్వరును గనుపడకపోవుటచే, తిరిగి తమకార్యాలయమునకు బోయిరి.

# 11. బల్లకట్టు ప్రమాదము.

రామనగరమునకును భీమనగరమునకును మధ్యనున్న పెద్దయేటికాలువలో నావలనుండి ఈవలకొక పెద్దబల్లకట్టు చేరెను. అప్పటికి రేయి సగముగడచెను. ఆకసమెల్ల మబ్బుచే గ్రమ్మబడి, ఒకానొక్కడు గుర్తించునట్లులేదు. పెద్దగాలియు వీచుచుండెను. చెట్లకొమ్మ లుయ్యాలలూగుచుండెను. కాలువ యొడ్డునగల చెట్లకొమ్మలగాడ్పు నూపులకు పరిపక్వములగు ఫలములు నీటిలోబడి నాదము చేయుచుండుటవలన నొకరి మాటయు నింకొకరికి వినఁబడునట్లులేదు.

ఆ సమయమున పదునొకొండుమంది మనుష్యులు నల్లనిచడ్డీలును బనియనులను దొడిగికొని గుతుపలను గత్తులను భుజములపైనిడికొని బల్లకట్టునొద్దకువచ్చిరి. వారి మొగములయందు నల్లనిరంగు పూయబడియుండెను. మేనెల్ల నాముదముతోఁగలిపిన మసిబొగ్గు పూయబడియుండెను. వీరిలో నగ్రేసరుడగువాడు పెద్దపెద్దగుడ్లుగల విశాలనేత్రములను, పొడవైన బురగ్రమీసములను, విశాలమైనమిట్టను దురును గలిగియుండెను. ఆ జనసమూహమును జూచిన తెప్పనడుపువాడు ఇంచుకయుభయము చెందలేదు. నిశ్శబ్దముగ బడవలోనికెక్కుడని వారితోననెను. పదునొకొండుగురును నొకనితరువాత నొకరుగా బల్లకట్టులోనికెక్కిరి. గాలికారణము వలన యేటికాలువలో నెక్కువతరంగములు లేచుచు బడవ

నుయ్యాలలూపుచుండెను. జనసమూహమునకు నాయకుఁడగు వాఁడు, గంభీరనినాదముతోఁ జెప్పను బోనిమ్మనెను.

అంత నా బల్లకట్టు నడపువాఁడు "అయ్యా! ఆఱు మాసములనుండి నాకేమియు సుంకము ముట్టలేదు. నేను బిల్లలుగలవాఁడను. ఈ కరువుకాలములో తెల్లనిరూపాయి నిచ్చినగాని, చిట్టెడుగింజలు పుట్టుటలేదు. బీదవానియందు దయయుంచి నాకేమైన నిప్పించుఁడని మొఱపెట్టుకొనెను. అంతట నా సంఘనాయకుఁడు "ఓరీ! నీవు చేసినకష్టమునకు బ్రతిఫలము నీయకపోము. కాని నీవు సొమ్మునడుగవలసిన సమయమిదికాదు. మేము సొమ్ముకొఱకే పోవుచున్నాము. తిరిగివచ్చునప్పుడు నీవేమియడిగినను నిచ్చుటకు సంసిద్ధులముగా నుందుము. ప్రస్తుతము సంశయింపక తెప్ప నడుపుము." అని ప్రత్యుత్తరమిచ్చెను. ఆమాటవిని పడవ వాఁడు చిత్తము. మీమాట కెదురుచెప్పువాఁడనుగాను. సురక్షితముగా గూరుచుండు"డని చెప్పి, తనచేతిలోనిగడను నొడ్డున బెట్టి బలముతోఁ నొత్తెను. బల్లకట్టు శీఘ్రముగ నొడ్డునుండి దూరమయ్యెను. కాని పడవ కాలువలోనికిఁ బోయినకొలఁది అత్యంతసంచలనము నొందసాగెను. బల్లకట్టుపై నున్నవారు "ఓయీ! జాగ్రత్తగా నడుపుము. ఈ నాఁటితో మాయాశలు సరిచేయకు"మనిరి. అయ్యా! నన్నేమనకుఁడు వాయుదేవునకు మ్రొక్కుఁడు. గాలి నెమ్మదించినచో బల్లకట్టు నిలువబడునని జవాబుచెప్పెను. తెప్ప క్రమక్రమముగా నడికాలువలోనికి బోయెను. అప్పుడనతిదూరమున జలాంతర్గామి యొక్కపరి నీటిపైకి దేలి బల్లకట్టు స్థానమును బరిస్థితిని జూచుకొనెను.

ఒక్క నిమిషములో నా జలాంతర్గామి తిరిగి నీటిలో మునిగెను. రెండవ నిమిషమూన జలాంతర్గామి నీటిలో ప్రయాణము చేసి వచ్చి సరిగా బల్లకట్టుక్రిందకువచ్చి పైకి దేలమొదలిడెను. బల్లకట్టునడుగున దెబ్బదగిలి తలక్రిందయ్యెను. దాని అడుగు మట్టము చెక్కలుసైతము తుత్తునియలయ్యెను. బల్లకట్టుపై నెక్కినవారందఱు నీటిలోబడిరి. ఇంకను సగముకాలువ దాటవలసియుండెను.

పదునాల్గుండుమందిలో నైదుగురు ప్రవాహమునబడి గుటకలువైచుచు గొట్టుకొనిపోవుచుండిరి. శేషించిన యారుగురును నీటిపై దేలి యీదులాడసాగిరి. బల్లకట్టు నడపువాడును గాలువనీదుకొని యావలియొడ్డున జేరుకొనెను. ఆరుగురుజనులలో వారినాయకుడొకడుండెను. ఈ అయిదుగురును వారినాయకుడును బలవంతులును, నీతనేర్చినవారును నగుటచే ప్రవాహవేగమును లెక్కసేయక, తరగలలో మునుగుచు దేలుచు నరగంటసమయమునకు నొడ్డునకు జేరుకొనిరి. దరికిజేరువఱకు వీరలారుగురును నతిశ్రమచే నలసతగొని గట్టున జతికిలబడియుండిరి. సేదదీర్చుకొనినతరువాత, నొకరినొకరు కలిసికొని, యిట్లు సంభాషించిరి. నాయకు డిట్లనెను.

"ఓయీ ! మనవాంద్రయిదుగురును నేమయిరో తెలిసికొనవలదా"

"మనమెట్లో బయటపడితిమి. వారింక నెంతదూరము కొట్టుకొనిపోయిరో వెదుకవలయునుగదా ?"

నాయ:—"తప్పక వెదుకవలయును. మీరు నలువురును నీ కాలువగట్టువెంట దిగువకుబోయి వారిని వెదకికొనిరండు. నేనును నితడును నిందేకూర్చుండియుండెదము."

పదంపడి యా నాయకుని అనుజ్ఞప్రకారము నలువురు మనుష్యులు కాలువగట్టువెంట దిగువకు నడిచిపోయిరి. కటిక చీకటి గ్రమ్ముకొని యున్న కారణమున, వారు చాలదూరము పోకముందే అగోచరులయిరి. బల్లకట్టువాడు నీటగొట్టుకొని పోయిన బల్లకట్టును బట్టుకొనుప్రయత్నమున గట్టువెంట నడచుచుండెను.

అంతలో సంఘనాయకుడును ననుచరుడును గూర్చున్న తావునకు బైభాగమున నీటిపైన ఒకనావ తేలి యుండొక దీపముగనబడెను. కాని యాదీపము వెంటనే యదృశ్య మయ్యెను. ఆదీపము జలాంతర్గామికి సంబంధించినదని చదువరు లూహింపకమానరు. ఒకటి రెండునిమిషములలో నచ్చటియొడ్డున ముగ్గురుయువకులు దిగిరి. వారికిని, బల్లకట్టు రేవునకును నొక్క ఫర్లాంగుదూరము మాత్రముండెను. రేవునుండి నూరుగజములదూరమువఱకు నామువ్వురు యువకు లలో ముఖ్యుడు తనచేతనున్న చిన్నశతఘ్నితో, రేవున మాటాడుమనుష్యుల కంఠధ్వనినిబట్టి వారికి సూటిగ గ్రపేల్చెను. నాయకునికాలిపై చిన్నదెబ్బతగిలెను. వానిచెంతనున్నవానికి వక్షస్థలమున నొక్కగుండుదాకిన, నతడు వెంటనే నేల కొరిగెను. జనసంఘనాయకుడు కుంటుకొనుచు నొకచెట్టును చాటుజేసికొని యదృశ్యుడై కొంతవడిదాగి, పిమ్మట రెండవ

చెట్టుచాటునకుబోయి డాగెను. జలాంతర్గామినుండి వచ్చిన యువకులు వారిజాడకై వెదకివేసారి మఱలిపోయిరి. సంఘ నాయకుడు, ఇంక నా గట్టుననుండరాదని, తిరిగి కాలువ లోనికుఱికి, కాలువనెల్లనీది, యావలియొడ్డునకుజేరి యల్లనల్లన తననివాసస్థానమునకు బోవుచుండెను. పాదమున నపాయకర మైన దెబ్బతగిలినను, లెక్కసేయక, కాలువనెల్ల నీదుటకు నీటబ్రవేశించునంతటి సాహసశీలి పాండురంగడుగాక మఱి యెవ్వడుకాగలడు.

జలాంతర్గామిని నడుపుటకు శిక్షబొందినవాడు మనోహరరావేయని చదువరు లెఱింగియేయుందురు. ఆనాడు సైతము పాండురంగడుచిక్కక తప్పుకొని పోయెగదాయని ప్రభాకరుడు మిక్కిలి విచారమునొందెను. అంతనతడు జలాంతర్గామిని, స్థావరమునకుజేర్చి దానిని భద్రపఱచి మనోహరరావు కార్యాలయమునకుబోయి జరిగినవృత్తాంతమును వినిపించెను. పాండురంగడానాట తనదోపిడియుద్యమమునకు భంగము గలిగెనుగదాయను విచారముతో గుహామందిరమునకు జేరెను.

---

# 12. వంచకుని వినాశమునకు బునాది.

పాండురంగడు తనచేతఁజిక్కిన మణిపేటిక తిరిగి యన్యులస్వాధీన మయినందులకు ఎనలేనిసంతాపము నొందుచుండెను. అతడు దోపిడిగాడును, హంతకుడును నైనను, ప్రకృతితత్త్వము నెఱింగినవాడు. అతనికి విజయలక్ష్మియందు గాఢానురాగము గలిగియుండుటచే, ఆ యనురాగమును క్రమమైనమార్గమున వినియోగించి, విజయలక్ష్మిమనస్సును స్వాధీనపఱచుకొనుటకే యత్నించుచుండెను. చేతఁజిక్కిన పిట్టను మెడవిఱిచి యగ్గిలోవైచుట యొక్కఘనకార్యము గాదని యతనియభిప్రాయము. విజయలక్ష్మిని గుహామందిరమున నంతమొందించుటకు అతనికి అయిదునిమిషముల కాలము పట్టదు. కాని దోచుకొనివచ్చిన ధనమైనను, భూమిలోదొరకిన ధనమైనను వ్యర్థముగా గంగలో బాఱవైచుటకెవ్వడును సమ్మతింపడుగదా? విజయలక్ష్మి యాతని దృష్టిలో కోట్లధనమునకుమించిన విలువగల సువర్ణరాశిగా నగపడుచుండెను.

పెక్కుశ్రమచేసి యార్జించినమణిపేటిక యన్యాక్రాంత మగుటచేతను, దానిని తెఱచుమార్గమైనను దెలియఁబడక పోవుటచేతను, పాండురంగని చిత్తమప్పుడెంతయో చాంచల్యము నొందసాగెను. నియమితపదార్థసంపాదనమెట్లున్నను విజయలక్ష్మిని స్వతంత్రవిహారములోనునిచి, సౌఖ్యముతో నుండజేసి, యెట్లయినను, గుహాంతర్జీవితము ఆమెకు సౌఖ్య

దాయకమైనదని యామెచిత్తమునకు దోచునట్లు చేయవలయునని యతడాలోచించెను. పరశురామునిచేత నామె కెన్నియో నీతులు చెప్పించుచుండెను. దూరస్థమైన మహాధనరాశికంటె హస్తగతమైన యత్యల్పధనము అక్కఱకు వచ్చునని పలుపర్యాయములు బోధింపజేసెను. అప్పుడప్పుడు శాస్త్రగ్రంథస్థ వాక్యములను సన్న్యాసిచేత వినిపించెను. కాని విజయలక్ష్మి యత్యంత ధర్మానురాగిణి. నిశ్చలచిత్తురాలు. ప్రాణమునివ్వటకైన సిద్ధపడునుగాని, మానమును గోల్పోవునదికాదు. అత్యంతమేధావిని. యుక్తిపరురాలు. నియమిత పదార్థములను సాధించుకొనివచ్చినచో, పాండురంగనితో మైత్రిచేయుట కిష్టపడుదానివలె సంచరించుట తన ముఖ్య కర్తవ్యమని భావించుచుండెను.

సంతోషమయ వాతావరణము ప్రకటించుచుండుటకు విజయలక్ష్మి యొక్క యుపాయము పన్నెను. గుహామందిరమునకు బాహ్యప్రదేశమున దనవిహారముకొఱకు చిన్న యారామమును నిర్మింపవలయునని తనయభిలాషగా పాండురంగనికి దెలిపెను. పాండురంగడందుల కత్యంతోత్సాహముతో సమ్మతించెనుగాని, యది ప్రకృతిసిద్ధమైనదిగా గనబడవలయునుగాని, యీ ప్రాంతమున నెవ్వరో మనుష్యులుండి పోషించినదానివలె నగపడరాదనిమాత్రము చెప్పెను.

రాఘవరావును గుహామందిరమునకు జేర్చినయప్పటి నుండియు నతడొక చీకటికొట్టులో నుంచబడెను. అతనికిని ఆహారపానీయములను విజయలక్ష్మియే యొసంగుచుండెను. రాఘవరావుయొక్క పరిస్థితులను, వృత్తాంతమును గను

గొనుటకు విజయలక్ష్మికి రెండుదినములవఱకును వీలు కలుగలేదు.

తుదకు పరశురాము డొక్కదినమున రాఘవరావు కాహారము నీయబోయినప్పుడు నెమ్మదిగకూర్చుండి మాటా డెను. అప్పుడు రాఘురావు "నేను మనోహరావు బావమఱది నని చెప్పెను. తాను పట్టుబడిన విధానమునంతయుఁ బూస గుచ్చినట్లు పరశురామునకు జెప్పెను. ఆ వృత్తాంతము నంతయు పరశురాముడు విజయలక్ష్మికి దెలియజెప్పెను. రాజనీతికోవిదురాలైన విజయలక్ష్మి యానాటిసాయంకాల మున, రాఘవరావు కాహారమును స్వయముగ గొంపోయెను. విజయలక్ష్మి యాతనిదీనముఖమున దైన్యపూరితములైన దృష్టులతోఁజూచి యాతని విమోచనమునకును నవకాశము గలుగగలదని యాశగొలిపెను. రాఘవరావును నామెతో నించుకతడవు విశ్వాసముతో సంభాషించి "నన్నీచీకటి కొట్టునుండి వెలువరింపజేసినచో నేనునీకు యావజ్జీవకృతజ్ఞుడ నని మఱిమఱిపల్కి వందనమాచరించెను.

దయారస పూరితురాలైన విజయలక్ష్మి తన స్వతంత్ర స్థానమున గూరుచుండి పరశురామునిబిలచి పాండురంగడు తనయొద్దికివచ్చి మాట్లాడిపోవునట్లు వార్తచెప్పుమనెను. పరశురామునివేదికపై పాండురంగడు విజయలక్ష్మి యెదుటికి వచ్చి మీసములు సవరించుకొనుచు హాసన్ముఖుడై కూరు చుండెను. విజయలక్ష్మికిని బాండురంగనికిని నీదిగువ సంభా షణము జరిగెను.

విజ:—మణిపేటికలోని యంగుళీయకమును దీయించ గలిగితివా?

పాండు:—దానిని దెఱపించవలయునను ప్రయత్నమునం బలువురకుజూపగా, నెవ్వరును దానిరహస్యము నెఱుంగ జాలరైరి. పదంపడి యొకయువకునిబట్టుకొని వానిచే దెఱపించ బ్రయత్నించితిని. కాని దైవవశమున నతడు నన్ను మోసగించి యా పేటికనతడే సంగ్రహించుకొని పాఱిపోయెను. ఆసందర్భమున బట్టుబడిన రాఘవరావును మన గుహామందిరముననే చీకటికొట్టులో నిర్బంధించి యుంచినాను.

విజ:—"నిన్ను మోసగించిన యువకునకును, పేటికను దెఱచుమార్గము తెలియునా?"

పాండు:—"తెలియుననియే నేననుమానించితిని. ఒక క్షణములో నా పన్నాగము చెడినది. లేనియెడల, బేటికను దెఱపించి, యందలిపదార్థములనుదెచ్చి నీకు జూపెడివాడనే."

విజ:—"అట్లయిన నీ రాఘవరావుమూలముననే తిరిగి యాయువకుని మోసగించి, కార్యము సాధింపవలయునని నా యభిప్రాయము."

పాండు:—మంచిది. నీవువానితో తఱుచుగ సంభాషణము జరుపుచు నతడు మనకు దోడ్పడునట్లు చేయవలయును.

విజ:—నా చేయదగిన ప్రయత్నము నేను జేసెదను. అందులకొక యుపాయము చెప్పెదనువినుము. నేను ఈ సాయంకాలము మొదలుకొని మన గుహామందిరమునకు వెలుపల నొక చిన్నయారామము విహారార్థము నిర్మించ

యత్నించెదను. రాఘవరావును మనచెట్లకు నీరుబోయు వానినిగా నియమించుము.

పాండు:—అట్లేచెప్పెదను.

విజ:—ఎట్లైనను నా నియమమును నెఱవేర్చ ప్రయత్నము గట్టిగా జేయవలయును.

పాండు:—అంతకంటె నాకు గావలసినదేమున్నది?

అంతట సాలోచనముఖుడై పాండురంగడు తన యరలోనికిబోయెను. అతనిచిత్త మంతకంతకు నాందోళన పరిస్థితిపాలగుచుండెను. నిద్రాహారములువిడిచి, విజయలక్ష్మి పెట్టిననియమమును సాధించుటకే యాలోచించుచుండగా, శత్రుకోటి యధికమగుచున్నదను భీతియొకటి యతని తేజస్సును గ్రుంగించుచుండెను. జలాంతర్గామిదెబ్బవలన బడిననష్టమున కతడెంతయో దిగులొందెను. తన సంఘము వారిలో నైదుగురిజాడ యప్పటికిని దొరకకపోవుటచే, వృత్తి ప్రచారమును గొంతజంకువడసినది. గుహామందిరమును బలపఱచుటయు, వృద్ధిచేయుటయు నతని చిరకాలప్రశ్నలలో నొక్కటియైయుండెను. స్వజనసంఖ్య తగ్గినకొలంది, గుహామందిరమును బలవత్తరముసేయుట యత్యంతావశ్యకముగా దోచుచుండెను. బాహ్యప్రచారావశ్యకత యెట్లున్నను, నాత్మరక్షణము ముఖ్యకర్తవ్యముగనుక, గుహానిర్మాణమున గొంత యభివృద్ధిసేయ బూనుకొనెను. గుహామందిరమునకు పైభాగమున గండశిలల చాటుచేసికొని, మనుష్యులు సురక్షితముగా గూర్చుండి తుపాకులు పేల్చుటకు నవకాశములు కల్పింప మొదలిడెను. గండశిలలతో నొకదొడ్డిగ మందిరముపైన

నేర్పాటుగావించెను. ఆ దొడ్డిగోడలకు నడుమనడుమ శిలామందిరముల నిర్మాణము చేయించి యనుచరులు ఎండవానలకు దలదాచుకొను సదుపాయములు చేయించెను. సామాన్య శత్రువర్గము తనపైకివచ్చినప్పు డెదుర్కొనుటకు దగిన యన్ని యేర్పాటులును జేయించుకొనియుండెను.

---

# 13. అశ్వమునకు స్థానచలనము.

ఒకనాటి యుదయమున ఫతేదారు మనోహరరావు కార్యాంతరమున శిల్పకారుడగు వీరభద్రునింటికి బోయెను. వీరభద్రుడు వంటయింటిలో నుపహారము చేసికొనుచు, మనోహరరావు కంఠధ్వనిని, బిలుపును గ్రహించి, అయ్యా? చావడిలో బల్లమీద దయచేయుడు. ఉపహారము తీసికొని వచ్చుచున్నానని లోపలనుండి భాషించెను. మనోహరరావు తలుపు తెఱచుకొని చావడిలోనికివచ్చి యచ్చట నమర్చబడి యున్న యొకబల్లపై గూర్చుండెను. చావడికి కుడిప్రక్క నొక పెద్దగదియుండెను. తఱుచుగా నీగదికి వీరభద్రుడు గొళ్ళెమువేసి యుంచుచుండెడివాడు. ఆనాడు వీరభద్రుడు ఆకలిముఖమున నింటిలోనికిబోవుచు తలుపు తెఱచి తిరిగి

మాయకయే వెడలిపోయెను. ఈగదిలోననే చెక్కగుఱ్ఱము సురక్షితము చేయబడియుండెను. ఎదురుగకూర్చున్న మనోహరరావుదృష్టి యా చెక్కగుఱ్ఱముపై బ్రసరించెను.

అంతలో వీరభద్రుడు ఉపాహారమును దీసికొనివచ్చి మనోహరరావుమోల నొకబల్లపై నుంచి, యొక్కపాత్రితోఁ బానీయమును సందుంచి,

"అయ్యా! మీరెన్నడును, మాయింటికి వచ్చువారు కారు. నా భాగ్యవశమున నేడేలనో మీ చరణకమలములను మాయింటమోపినారు. ఇది నా పూర్వజన్మ సుకృతము." అని యతనిని బ్రశంసించెను.

మనోహరరావు ఉపహారపుపాత్రముమోల గూర్చుండెనే గాని, యాతనిదృష్టియంతయు కొయ్యగుఱ్ఱముపైననే యుండెను. మనోహరరావు చూపువచ్చిన క్షణమునుండియు గృతకాశ్వముపైననే యుండుటనుగనిపెట్టి, వీరభద్రుడు, ఫతేదారు దానినిగుఱించి ప్రశ్నించినచో దానీయవలసిన ప్రత్యుత్తరము నాలోచించుకొని చిఱునవ్వుతో సంభాషించుచుండెను.

కొంతవడికి మనోహరరావు "వీరభద్రుడా! ఈ గుఱ్ఱమును నీవే చేసితివా?" యని యడిగెను.

"నేనేచేసితిని."

"చాల సుందరముగానున్నది. ముఖమునకు దగిన చెవులున్నవి. ముక్కుపుటములు సరియైనస్థానమున జెక్కబడినవి. కన్నులును సముచితస్థానములయందు సముచితరీతి, నిమిడ్చబడినవి. ఎందఱో నీవు గొప్పశిల్పకారివని కొనియాడు

చుండగా నేనేమో యశ్రద్ధగా, ప్రపంచము కొంచెమును గొప్పగాజేసి మాట్లాడుచుండునని విస్మరించుచుండెడివాడను. నీచాకచక్యము నాకు గన్నులయెదుటఁ బ్రత్యక్షముగ నగపడుచున్నది. నిజముగా నీవు మయునియంతటివాడవు."

"దేవర యనుజ్ఞయైనచో నెంతటిశిల్పమునైనను జిత్రించగలను."

"అందుకు సందేహములేదు. సరి. ఈయశ్వము నెవ్వరి కొఱకుఁ జేసితివి ?"

"దీనిని నేనెవ్వరికొఱకును జేయలేదు. నా శిల్ప నైపుణ్యము నేదేని యొకపదార్థమునందగపఱచవలయునని యీ యశ్వమును నిర్మించితిని."

"నీవుపడిన శ్రమమునకు దగినప్రతిఫలము నిచ్చినచో దీని నెవ్వరికైన నిచ్చివైచెదవా ?"

"అందులకేమియు సందేహములేదు. కాని ఈ శిల్పము యొక్క రీతులను నేనప్పుడప్పుడు చూచుచుండవలయునని నాయభిలాష. నేను మఱొకయశ్వమును నిర్మింపదలంచినచో దీనినిబట్టి కొలతలు దీసికొనుట యవసరమగును. మన నగరములో మనకు దెలిసినవారెవరైన దీసికొనదలంచినచోఁ దగిన ప్రతిఫలము దీసికొని దీనినిచ్చివేయుటకు సంసిద్ధుడను."

"ఎంతధనము కోరెదవు ?"

"ఏనూరురూపాయి లడిగెదను."

"అట్లయిన నీ యశ్వమును నాయింటనే యుంచుకొనియెదను. నీవెప్పుడు మాయింటికివచ్చినను, నీ గుఱ్ఱముయొక్క కొలతలను దీసికొనుటకు నేనభ్యంతరముచెప్పను. ఇవిగో !

ఈ పైదునోట్లను దీసికొనుము. ఒక్కొక్కటి నూరు రూపాయిలనోటు, తీసికొనుము." అని మనోహరరావు వీరభద్రునకు రొక్కమిచ్చి కొయ్యగుఱ్ఱమును బయటికి దీయించెను. దానికాళ్ళకు నాలిగింటికిని నాలుగుచక్రము లుండెను. రెండవమనిషి సహాయము లేకుండగనే వీరభద్రుడు స్వయముగా నాగుఱ్ఱముపైన నొకవస్త్రముగప్పి, నడుపుచు, మనోహరరావు నివసించు గృహమునకు దీసికొనిపోయి సంతోషపూర్వకముగా నిచ్చివైచెను.

పదంపడి మనోహరరావు, కొయ్యగుఱ్ఱమునని౦కేమేమి రహస్యములున్నవో చెప్పుమని యడిగినమీదట, దానిగర్భ ములోగల మనుష్యులకుదగిన వసతులను బ్రక్కరంధ్రములను, తదితరరహస్యములను దెల్పి, అదిచక్రములపై స్వయముగా ముందువెనుకలకు సాగుట కేర్పఱచబడిన యంత్రమును జూపెను.

మనోహరరావు చాలసంతసించి, అదనముగాజూపిన యంత్రాదికమువలన నదియింకను ఎక్కువవెలచేయునని అంచనావైచి వీరభద్రునకు మఱియు నేనూరురూపాయిల నొసంగెను. వీరభద్రుడును నత్యంతానందభరితుడైనట్టు లభిన యించి, మనోహరరావుకు కృతజ్ఞతాభివందనముసేసి నిజ గృహంబునకు బోయెను. మనోహరరావు దానిని గదిలో భద్రపఱచి, పైన నొకవస్త్రముగప్పి యెవ్వరకును వెల్లడి గానీయక, ఇంటివారలకుసైతము నిది వినోదార్థముగా నింట నుండుటకు దీసికొనబడిన యొక కొయ్యగుఱ్ఱమని చెప్పుచు గాపాడుచుండెను.

వీరభద్రుడు నిజనివాసమునకు బోవుచు దనమనస్సున నిట్లు వితర్కము చేసికొనసాగెను. "అకటా! పరశురాముని వద్ద మిక్కుటముగ ధనము సంగ్రహించి ఈ యశ్వశిల్పమును జేసితిని. అతడు నాయొద్ద సురక్షితముగానుంచుమని గట్టిగా జెప్పెను. అవసరపడునప్పుడు దీనిని గోరెదను. దాని నుపయోగపఱచుకొందునని చెప్పెను. ఏదోఒకనిమిత్తము నిర్వహించుకొనుటకే యతడు చేయించికొనియుండును. అతడువచ్చి నాయశ్వమేదని యడిగినచో నేనేమనిచెప్ప వలయును? నైతికముగ నేనొక పెద్దపొరపాటు చేసితిననుటకు సందియములేదు. మఱికొంతతడవు చింతించి, మంచిది, ఫతేదారు మనోహరరావు ఈ యశ్వమెవ్వరికొఱకు జేసితివని ప్రశ్నించెను. నేనితని యూరుపేరులు బయలుపెట్టితినేని, యతనికి పెద్దప్రమాదము వాటిల్లును. మనోహరరావు వానిని బట్టుకొని వానినివాసస్థానమును బరిశోధించి, ఇతడు చోరుడని నిర్దేశించుకొని, ఇతనిపై నొక్కయభియోగముపెట్టి, నిర్బంధావాసమునకు బంపగలడు. నమ్మినవానిరహస్యము బైటపెట్టి, విపత్తులపాలుచేయుట ధర్మానుకూలముగాదు. ఇప్పుడేమి చేసితినో యదియే సమంజసము. పరశురామునకట్టిది గట్టిగా నవసరమైనచో, మఱియొక కొయ్యగుఱ్ఱమును జేసిఇచ్చుట యుత్తమముగాని, వానిని బ్రమాదముపాలుచేయుట తగదు."

వీరభద్రుడు క్రమక్రమముగా నిల్లుజేరి పరశురాము డెప్పుడువచ్చునోయనుభీతిచే, జాలత్వరపడుచు, మఱికొన్ని చెక్కలను దెప్పించుకొని, తిరిగి యాప్రకారముగనే నూతన దారుతురంగనిర్మాణము నారంభించెను.

మనోహరరావు ప్రభాకరరావును బిల్చుకొని తన యొద్దకు జేరిన దారుతురంగమునుజూపి దానియుపయోగమును గుఱించి బోధించెను. ప్రభాకరరావు యంత్రాదికముసై తము జూచి దీనిని దగుసమయమున నుపయోగించితిమేని, కొన్ని కొన్ని గొప్పకార్యములు మనకు స్వాధీనములు గాగలవని అట్టిదానిని సంపాదించినందులకు మనోహరరావును మిక్కిలి శ్లాఘించెను.

---

# 14. కొయ్యగుర్రము కడుపులో జీవాలు

మనోహరరావు ఫతేదారు తనకార్యాలయమున గూరుచుండి, రక్షకభటుల నొక్కొక్కరిని బిలిచి, ఎవరికిదగిన కర్తవ్యతను వారికిదెల్పుచు, స్థాననియమములను జేయుచుండెను. అప్పటికి సాయంకాలము నాలుగుగంటల సమయమైనది. అప్పటికానాటి తపాలవాడు మనోహరరావుకు బత్రిములను దెచ్చియిచ్చెను. వానిలో మాండలికపరిశోధన శాఖాధికారినుండి మనోహరరావుపేరట నొక యుత్తరముండెను. మనోహరరావు దానినిదెఱచి యిట్లు చదువుకొనెను.

"మనోహరరాయా! మీప్రాంతపు ప్రజలనుండి యనేకములగు విజ్ఞప్తులు వచ్చుచున్నవి. అటవీప్రాంతములో నొక చోరులగండడు కలడనియు, వానినాయకత్వముక్రింద చోరులు చెలరేగి, పెక్కుమందియిండ్లలో గన్నములు వేయుచు, అల్పసంఖ్యాకులుగనున్న గృహస్థులను బెదరించి సొమ్ముదోచుకొనుచు, త్రోవలవెంట బాటసారులనుబట్టి కొట్టి దొరకిన యంతసొమ్ము నపహరించుచు దేశమునెల్ల కల్లోల పఱచుచున్నట్లు విజ్ఞప్తులలో వ్రాయబడుచున్నవి. ఈ వారముదినములుమాత్రము నీకు గడువీయబడుచున్నది. ఈ ఎనిమిదిదినములలో నీవాచోరులగండని బట్టజాలక పోయినచో, నిన్ను మఱియొక తావునకుబంపి నీస్థానమున మఱియొక ఫత్తేదారును నియమించెదము. నేటినుండి యధిక శ్రమచేసి, చోరనాయకుని బట్టుకొనవలయును.

ఇట్లు.

మాండలిక పరిశోధన శాఖాధికారి,

మధుసూదనరావు.

ఆ యుత్తరముపైన రహస్య క్రార్యక్రమపత్రము అని వ్రాయబడియుండెను. దానిని బూర్తిగ జదువునంతనే మనోహరరావు దీర్ఘాలోచనతత్పరుడై కుర్చీపైననె వెనుకకు జేరబడెను. కన్నులుమూసికొని నెత్తిపై చేయితోసవరించుకొనుచు నించుకతడవు కర్తవ్యతనుగుఱించి యాలోచించి, ప్రభాకరరావును బిలిపించుకొనెను.

ఇరువురును గొంతతడ వాలోచించినవెనుక నిట్లు ప్రసంగము చేసికొనిరి.

"ఈనాడు మనము సూటిగా దొంగలు వచ్చుపోవు దారిలోగాచి వారిలో నొకరిద్దరినిబట్టుకొని చెఱపట్టవలయును. వారినిబంధించి బాధించినచో, నాయకుని నివాసస్థానమును రహస్యములను వారే తెలుపగలరు. వారుచెప్పెడు విషయముల ననుసరించి, తరువాత కర్తవ్యమును విచారించుకొందము."

"ఇటు నట్లుచేయకున్నచో ప్రభుత్వముదృష్టిలో మనము న్యూనతవహింతుము."

"నీవు దుస్తులనుధరించి బయలుదేరుము."

ప్ర:—మనమిరువురమే వ్యక్తముగా బయలుదేరుటకన్న నేనొకయుపాయము చెప్పెదను. బాగుగా నాలోచించుము."

మ:—ఏమందువు. నీ యుపాయమేమి ?"

ప్రభాకరరావంతటఁ దనకుర్చీని మనోహరరావు కుర్చీ యొద్దకు జరుపుకొని యతిరహస్యముగా కొన్నిమాటలు చెప్పెను. అప్పుడు మనోహరరావు పరమానందమునుబొంది, ముఖమ్మున నధిక తేజస్సునుధరించి "నీయుపాయము బాగున్నది. నేనావిషయమునే విస్మరించితిని. సమయమున ముఖ్య విషయమును స్మృతికిదెచ్చితివి." అని ప్రభాకరరావు తెలివిని శ్లాఘించెను. తరువాత ఉభయులును బయలుదేరి మనోహరరావు నివసించు గృహమునకుబోవుచు, గొందఱు రక్షక భటులకు ఆరాతిరి వారికర్తవ్యమును జెప్పిరి.

రాతిరి పదునొకొండుగంటల సమయమయ్యెను. భీమ నగరమునకు దూర్పుభాగమునగల యడవి దట్టముగా నుండుటచే దూరస్థులగు బాటసారులు కంటికినగపడుటలేదు. కటిక

చీకటి భూనభోంతరాళమును నల్లబఱచెను. దగ్గఱకువచ్చిన మానవునికైతము మఱొకమానవుడు కనుగొనలేని పరిస్థితి యుండెను. భీమనగరమునుండి తూర్పుగాబోవు నడవిబాటలో నొక దారుతురంగముండెను. దానికేవిధమైన చలనము లేకుండెను.

పాతిబడి నలిగి, ముడతలుబడుచున్న రక్షకభటుల దుస్తులనుధరించిన యిద్దరు గంభీరమూర్తులు తూర్పునుండి పడమటకు ప్రయాణముచేయుచు, త్రోవలోనిలువబడియున్న యశ్వరాజమును జూచిరి. అందెందును మనుష్యసంచారము లేకుండెను. ఆ ప్రదేశమునుండి భీమనగరమింకను నొక్క మైలునకుమించిన దూరములోనుండెను. మానవుని కంఠ ధ్వనియైన నాచుట్టుప్రక్కల వినబడుటలేదు. రక్షకభటా కృతిలోనున్న యాపురుషులు తమమ్రోలనున్న యశ్వమును జూసి, యిట్లనుకొనసాగిరి.

"ఒరే! నేడు మనకొకగుఱ్ఱము దొరకినది."

"ఇది భీమనగరమున నివసించు నొకగృహస్థునిదై యుండవలెను. నిశివేళ త్రాడు తెంపుకొని పాఱివచ్చినది."

"ఎట్లువచ్చిననేమి? ఎవరిదైననేమి? మనము దీని నీచెట్టునకుగట్టివైచి పోవుదము. మనముపోవువని ముగించు కొని దొరకినసామ్మును తిరిగివచ్చునప్పు డింతవఱకు మోసికొనివచ్చి, దీనిపైగట్టి యచ్చటినుండి యాసామ్మి నీ గుఱ్ఱముపైగట్టి తోలుకొనిపోవుదము."

"సామ్ముమాత్రమే మోయునా ఈగుఱ్ఱము? మన

మిద్దజముగూడదీనిపై గూర్చున్న యెడల, నదిమనలననాయాస ముగ మోసికొనిపోగలదు."

"అవునురా! ఈనాడు మనయదృష్టము పండినది."

"ఇప్పుడు దీనిగట్టుటకు త్రాడెక్కడ దొరకగలదు ?"

"ఓరి తెలివిమాలినవాడా ? నీ కన్నుపుక త్తిదీసి ఆచెట్టు దగ్గరకుబోయి, మానుమీద నాలుగుదెబ్బలువేసి యంతనార చీరుకొనిరమ్ము. అంతవఱకు నేనీగుఱ్ఱమును కదలనీయక నిలువబెట్టెదను."

అంత నా రెండవవాడు బిరబిర చెట్టునటికి నార దీసికొనివచ్చెను. దానినిదీసికొని యతడు అతిశీఘ్రముగ నఱచేతులతో నొక్కత్రాడు పేనెను. ఆత్రాటి నాగుఱ్ఱము మెడమీఁదవైచి దానిని గట్టిగాగట్టి ముడివైచెను. ఉభయు లును నాగుఱ్ఱముమెడ త్రాడునుబట్టుకొని నాలుగుగజము లీడ్చికొనిపోయి త్రోవప్రక్కనున్న యొకచెట్టుక్రింద నిలిచిరి. చీకటి దట్టముగానుండుటచే నాగుఱ్ఱము నడచివచ్చినదో, నేలమీఁదనే జరిగివచ్చినదో వారికి దెలియలేదు. మేనెల్ల నెరగ్రుగురప్రురంగు వేయఁబడి, గోగునారతోడను, గురప్రు వెంట్రుకలతోడను జూలును దోకయును నమరించబడి యుండుటచే, వారుదానిని సత్యముగ గుఱ్ఱమనియే విశ్వ సించిరి. చెట్టుక్రిందకు జేరగనే యుభయులును నన్యోన్య సాహాయ్యము చేసికొనుచు దానిని మ్రాకునకు గట్టుచుండిరి.

ఆసమయమున గుఱ్ఱపుపార్శ్వమునుండి రెండు తుపాకి గుండ్లు పేలెను. ఇరువురకును జెరియొకగుండు బాహుమూల మున దాకెను. వారిరువురును నేలపై వ్రాలిరి. వెంటనే

గుఱ్ఱముపార్శ్వమునఁ జెక్కడతలుపు తెఱువబడెను. పదిమంది రక్షకభటులు నేలమీఁదికుఱికిఁ దలుపుమూసివైచిరి. గుఱ్ఱ మెప్పటియట్ల మనోహరముగ గనబడుచుండెను. వీరెల్లరు నా యిరువురను జుట్టుకొని, వారిదుస్తులను దొలగించిచూచిరి. ఇరువురుదోపిడిగాండ్రు దొరకిరని వారెల్లరు సంతసించిరి. వీరు పాండురంగని దోపిడిగాండ్రని ప్రత్యేకముగ వ్రాయనక్కఱ లేదు. గుఱ్ఱములోనుండి దిగినవారిలో నొక్కఁడు మనోహర రావు ఫతేదారు. మఱియొకఁడు అతనియుద్యోగియగు ప్రభాకరరావు శేషించిన యెనమండుగురును భీమనగరము పరిశోధనాలయమునకు సంబంధించిన రక్షకభటులు.

అంతట వారెల్లరు నా ఇరువురను నిలువబెట్టి యశ్వ గర్భమునఁ బ్రవేశింప నాజ్ఞాపించిరి. చోరులు బాకుమూాల ములయందలి బాధచే మూలుగుచెట్టుచు, నల్లనల్లన నడచు కొనివచ్చి, తెఱువబడియున్న యశ్వద్వారమున గర్భమున బ్రవేశించిరి. రక్షకభటులు దానిని దొంటియట్ల చక్రములపై నడపుచు, భీమనగరమునకు గొంపోయిరి. ఊరివెలుపలనే చోరులకు జేతులుగట్టి క్రిందకుదింపి ప్రభుత్వపు చెఱసాలకు చేర్చి యందుంచి నిర్బంధించిరి.

మనోహరరావును ప్రభాకరరావును నిరువురుభృత్యుల సాహాయ్యమున నా యంత్రమయతురంగమును, మనోహర రావు నింటియొద్దకుజేర్చి పూర్వమది యున్న తావుననేయుంచి సురక్షితము జేయించిరి.

---

# 15. జయ, సాంబశివా!

మనోహరరావు మఱునాఁడుదయమున దనకిరువురు దొంగలు దొరకిరని మాండలిక పరిశోధనాధికారికి దెలియ జేసెను. దొరకినవారిని దనచెఱసాలలోనుంచి, చోరనాయకుని రహస్యములన్నియు దెలిసికొనవలయుననుకొనెను. కాని యతఁడు నిర్బంధితులను ఇరువదినాలుగుగంటలకంటె నధిక కాలముంచుకొనుటకు అధికారము పొందియుండలేదు. పాండురంగనికి జీవతుల్యులగు నిద్దఱుచోరులు దొరుకుటవలన, నిఁక బాండురంగని బట్టుకొనుట యత్యంతసులభమని మనో హరరావు భావించుచుండెను. కాని చిక్కుపడిన చోరులవల్ల అవసరాంశములు చెప్పించుటకు వారిని దనయొద్ద నాలుగైదు దినము లుంచుకొనవలసియుండెను. అందులకు మాండలి కాధికారి యనుజ్ఞ ఈయవలయును. ఈ యనుజ్ఞాపత్రము దెచ్చుకొనుటకొఱకాతఁడు నాటిమధ్యాహ్నము మూఁడు గంటలకు సేలాపురమునకు పయనమైపోయెను.

నాటిసాయంకాలమున, సూర్యాస్తమయానంతర సమ యమున, నొకజంగమయ్య భీమనగరమున మార్గముల దిరుగాడు చుండెను. కొన్నిబజారులుతిరిగి తుదకు గనుచీకటి సమయము నకు, మనోహరరావు నివసించు గృహమునుంగిటికివచ్చెను. మనోహరరావు నగరాంతరమునకు బోవుటచే, నింటియొద్ద నాతనిభార్యయగు కళ్యాణి యొక్కతెయేయుండెను. జంగ మయ్య "మహాదేవ! సాంబశివా" యని శంఖము నూదిన

తోడనే, లోపలనున్న కళ్యాణి, వెలుపలికివచ్చి యా జంగము వానితో నిట్లనెను.

ఓయీ! ప్రొద్దుగ్రుంకినతరువాత నేలవచ్చితివి? ఈ సమయమున మాష్టిపెట్టునలవాటు మాయిండ్లలోలేదు. పోయిరమ్మి.

జ:—అమ్మా! ఈయూరిలో ఒకగృహస్థునిభార్యకు శరీరారోగ్యముకొఱకు నేనొకయోషధిని దెచ్చియీయవలసి వచ్చినది. ఆ ప్రయత్నములో నేను గుట్టలు చెట్లు వెదకుచుంటిని. అందువలన నేడు పొద్దుగ్రుంకినదనుక భిక్షాటనమే చేయలేదు. సాంబశివుని పేర మీరొకకబళము పెట్టినచో నాకలి తీర్చుకొనియెదను. ఈ ఒక్క కబళము సాంబశివునకు పెట్టినట్లు మీరుతలంచుడు. మీకు సాంబశివుడు మేలు చేయును.”

కళ్యాణి:—నీకు ఓషధులు తెలియునా? ఆయిల్లాలి కేమిజబ్బు?

జ:—ఆ యిల్లాలికి చాలకాలమునుండి సంతానము కాలేదు. సంతానము కలుగునట్లుగా ఒకఓషధి నీయుమనినది. ఆ యోషధి కొండగట్టులలో దొరకును.

క:—నాకును సంతానముకాలేదు. నాకుగూడ ఆ ఓషధిని దెచ్చియిచ్చెదవా?

జం:—మీావంటిమీాద కొంచెము గ్రహమావహించి బాధించుచున్నది. దానికిమొదలు విబూదినిచ్చెదను. రేపటికే మీాకు ఒడలు తేలికయగును. ఓషధినిగూడ మీాకొసంగెదను. దీనిని దగ్గిరనుంచుకొని దానితో కషాయముదీసి మాడు

పూటలు త్రాగవలయును. మీకు సంతానము కాకపోతే నన్ను జంగము సాంబశివుడుఅని పిలువవలదు.

కళ్యాణి _అట్లయినచో బైకిరమ్ము. ఈహాలులో కూర్చుండుము.

సాం:_మీచేయి చూడవలయును.

క:_అట్లేచేయుము.

ఈ రీతిగ ప్రసంగముచేయుచు నా జంగమువాడు హాలునెల్ల నటునిటు పారజూచుచుండగా, నొక యద్దాల బీరువాలో తాను మున్ను గోల్పోయిన మణి పేటికను గాంచెను. ఒకటిరెండుపర్యాయములు దానిపంక జూచి అదియే మణి పేటికయని నిర్ధారణ చేసికొనెను. చేయిపట్టుకొని నాడీ పరీక్షాదులు చేసి కళ్యాణితో నిట్లనెను.

"అమ్మా! మీకు సంతానరేఖయున్నది. బాల గ్రహము మిమ్మావరించియున్నది. దానినిదొలగించి, సింహళ సంతాన చింతామణియను ఓషధిని మీకొసంగవలయును. సాంబశివునిపేర మీరు దానిని సేవించినచో, ఈ మాసాంత ముననే మీకు గర్భము నిలువగలదు.

క:_అట్లేచేసెదను. ఈ పరిశ్రమకు నీవేమి ప్రతిఫలము కోరెదవు ?

జం:_అమ్మా ! ఆ ఓషధిని నేను సింహళద్వీపమునకు బోయి జాలశ్రమపడి సాధించుకొనివచ్చినాను. దానిని సాధారణప్రజల కుపయోగపఱచుటలేదు. మీరు గొప్పవారు గనుక మీకు మేలుచేసి మీవద్ద గొప్పబహుమతి పొంద వలెనని తలంచుచున్నాను.

క:—నీవుకోరినది తప్పకనిచ్చెదను. నీకేమికావలయునో అడుగుము.

జం:—మీదగ్గర నేను ద్రవ్యముకోరను. మీపేరు నావద్ద శాశ్వతముగా నుంచుకొనుటకైన నొకవస్తువును గోరెదను.

క:—త్వరగానడుగుము. నీవేమికోరినను మాయొద్ద నున్నచో నిచ్చెదను.

జంగమువాడు ఆమెతో సంభాషించుచు నోటిలో నేదో ఒక మూలికను నములుచు గళ్యాణిముఖముపైన రెండు పర్యాయములూదెను. కళ్యాణికి పూర్వవిజ్ఞానముదప్పి యతడు పలుకరించినట్లు పలుకుచుండెను. వెంటనే యామెనొసట విబూదిచుక్కపెట్టి యొక్కచూర్ణమును వాసనచూడుమని ముక్కుదగ్గిరపెట్టెను. ఆమెకు మరింతమైమఱపు వచ్చు చుండెను. ఆసమయమున బీరువాలోని మణిపేటికను వ్రేలితో జూపి, నాకిదిగావలయునవెను. కళ్యాణి తనబొడ్డులోని తాళముచెవి నాతనికిచ్చి దానిని తీసికొనిరమ్మనెను. తృటి కాలమున నాతడు బీరువా తెఱచి "యా మణిపేటిక నామె చేతిలోబెట్టి అమ్మా దీనిని మీచేతితో సాంబశివుని పేర నా కొసంగుడనెను. కళ్యాణి మణిపేటికను జంగము సాంబ శివునకిచ్చెను. జంగమువాడు ఒకఓషధి నామెకిచ్చి విబూది పొట్లమునిచ్చి, జేయ్ సాంబశివా! అని అమ్మా యిఁక నాకుసెలవా అనిఅడిగెను. కళ్యాణియు దెలిసితెలియని అవస్థలోనుండి తిరిగి నాలుగురోజులు అయినతరువాత మఱల గనబడవలయునని చెప్పుచు బోయిరమ్మని పల్కెను. మణి

పేటిక నొక బట్టలోఁజుట్టి భద్రపఱచుకొని జంగమ సాంబ శివుడు ఒకనిమిషములో భీమనగరము ఊరిబయటికిఁబోయెను. అతడు నిత్యము ప్రజలుపయోగించు బాటనేపోవక ప్రక్క ప్రాంతపు నడవిప్రాంతమునకుఁబోయి చెట్లు చాటుచేసికొని ప్రయాణముచేయుచు శీఘ్రకాలమున నిజనివాసమునకు జేరెను. ఇట్లు మాయావేషమున మణిపేటికను దిరిగి సాధించిన నేర్పరి పాండురంగడేనని యూహించుట చదువరులకు సాధారణవిషయము.

---

# 16. ప్రజోపకారముకొఱకు నిర్బంధావాసము.

విజయలక్ష్మి ఆరామ పోషణము నెపమునఁ బరశు రామునితోడను, రాఘవరావుతోడను తఱచుగా గలియుచు, నిఁక నతిశీఘ్రకాలమున బయల్పడునుపాయము లాలోచించు చుండెను. పాండురంగనిబట్టించి బ్రిటిష్వారి స్వాధీనము చేయకున్నచో నతడెట్టిన దమజీవితములకు హానికారకుడు కాగలడనియు నిశ్చయముచేసిరి. ఒకనాటియుదయమున

ముప్వురునుగలిసి తీవ్రముగ నాలోచించి తోలుదొల్త పరిశోధన శాఖాధికారికి దమపరిస్థితిని దెలియజేయవలయు ననియు, అవసరమైన-చో వీరభద్రునిఇంటి కొయ్యగుజ్జము నుపయోగించుకొనవలసినదనియు, ప్రచ్ఛన్నరీతిలో దాము న్నచో, పాండురంగని దౌష్ట్యమును గన్నులయెదుట ధ్రువ పఱచెదమనియు దెలుపవలయుననియు, దీర్మానము జేసికొనిరి. తొలుదొల్త పరశురాముడు భీమనగరమునకుబోయి యీ విషయమును వీరభద్రునిమూలముగ మనోహరరావుకు వార్తనంపవలయుననియు నిశ్చయించిరి.

పరశురాముడు ఆనాటిసాయంకాలము నాలుగుగంట లకు బయలుదేరి కనుచీకటి పడువఱకు వీరభద్రునియింటికి జేరెను. వీరభద్రుడు "బావా" వచ్చితివాయని యాదరముచేసి కూర్చుండబెట్టి యేమివిశేషమని యడిగెను.

పరశురాముడు"అయ్యా! అశ్వము సురక్షితముగ నున్నదా ?"

వీర:—సురక్షితముగనేయున్నది. అశ్వముతోడి పని యింతతొందరలో వచ్చినదా ?

పర:—శీఘ్రకాలముననే అశ్వముతో పనిబడునట్లున్నది. దానినొకపర్యాయము చూచుకొని పోవలయునని వచ్చినాను.

వీర:—"అట్లయిన నున్నవిషయమును జెప్పెదను. వినుము. రెండుదినములక్రిందట పరశోధనాధికారి, ఫతేదారు మనోహరరావు ఏదోపనిపై మాయింటికివచ్చి, గుజ్జమును జూచి ఇది ఎవరుచేయించిరని యడిగెను. క్షణమాత్రమున నేను సందర్భమునుగ్రహించి, నీపేరుచెప్పక యేవో బూట

కములు చెప్పితిని. అతడు నాకీయశ్వము నిమ్మనియడిగెను. మఱియొకటిచేసి నీమాట దక్కించవచ్చునని తొలుత నాతని కదియిచ్చితిని. ఇదిగో ఇప్పుడు తిరిగి నూతనాశ్వనిర్మాణమును ఆ దేపోలికలో ప్రారంభించినాను. రేపుసాయంకాలమువఱకు నీకు అంతకంటె చతురమైన స్వరూపముతో నశ్వమును సిద్ధముచేసి యిచ్చెదను. నీ ప్రాణరక్షణముకొఱకు నేనీ యుపాయము సేసితిని వేఱుగా భావింపవలదు."

పర:—"మీరు చేసినపని నాకు విరుద్ధమైనదికాదు. కాని నీవు నాకు మఱొకయుపకారము చేయవలయును."

వీర:—"సిద్ధముగనున్నాను. సందేహింపక చెప్పుము."

పర:—"నీవీయుత్తరమును దీసికొనిపోయి మనోహర రావుగారి కీయవలయును." అతడాయుత్తరమునుజూచి చదువు కొనిన తరువాత నేమిప్రత్యుత్తరము చెప్పునో గమనించుము. నేను మీయింటిలోనున్నానని ముందుగా నీవాయనకు జెప్ప వలదు. "అవసరమైనచో నీయుత్తరము దెచ్చినయతడు యీ పర్యాయము నాయొద్దకువచ్చినప్పుడు మీయొద్దకు బంపెదనని చెప్పుము." అని పరశురాముడు తనకు విజయ లక్ష్మి యొసంగినయుత్తరమును వీరభద్రునకొసంగెను.

వీరభద్రుడు నూతనాశ్వనిర్మాణమువని కట్టిపెట్టి, మనోహరరావు కార్యాలయమునొద్దకు బోయెను. మనోహర రావు తనయింటినుండి మణిపేటికను పాండురంగడే వంచన మార్గమున నపహరించి యుండవచ్చునని విశ్వసించి యుండు టచే, నాతనిబట్టుకొను నుపాయమునకై యెదురుచూచు

చుండెను. అతనియాగ్రహము మేరమీఱియుండెను. అట్టి సమయమున నీ యాధారము లభించుటలో నతనికతిధైర్యము గలిగినది. ఇఁక పాండురంగడు చిక్కకపోడని నమ్మకగలిగినది. అతడు సమయమున కెదురు చూచుచుండెను. అట్టితఱి వీరభద్రుడు కనబడి అయ్యా యీ యుత్తరమును చదువుడని చేతికందించెను. మనోహరరావు దానినిట్లు చదువజొచ్చెను.

ఫతేదారు మనోహరరావుగారికి.

అయ్యా!

నేను పాండురంగనిచేతఁజిక్కి పడరానిబాధల పడుచున్నాను. నేనేదోయుపాయముపన్ని తప్పించుకొని వచ్చుటకు నాకు సాధ్యముగా గనఁబడినను, నేను క్షత్రియకన్యనగుటచేఁ బరాభవాగ్ని నన్ను దహించుచున్నది. వాని దౌష్ట్యములు చూచినకొలది, నాకు సంతాపమధికమయినది. వాడుచేయు దుండగములనుండి, ప్రజలను రక్షించుటకు, వానినెల్లని ప్రభుత్వమువారి స్వాధీనము చేయవలయునని సంకల్పించితిని. ఈ పరోపకార భావముతో, నేనిచ్చట నిర్బంధావాసము ననుభవించుచున్నాను. వానిదౌష్ట్యమును మీకు బ్రత్యక్షముగ గనఁబఱచి వానినేరములను ధ్రువపఱచుటకు నేనుమీకు సర్వదా తోడ్పడియెదను. ఈ యుత్తరము దెచ్చినవాఁడు తొలుత పాండురంగని యనుచరుడైనను నిప్పుడితడు నా ప్రాణమానములను గాపాడుచున్నాడు. కావున నీతనిని మీరు నిర్బంధింపవలదు. ఇతనిమూలముననే మనకు గార్యసిద్ధి గాగలదు.

విజయలక్ష్మి.

ఆ యు త్తరమును జదువుకొనినవెంటనే మనోహరరావు అత్యుత్సాహముతో లేచినిలుచుండి "ప్రభాకరా!" అని కార్యాలయములో బనిచేయుచున్నవానిని కేక వేసెను. ప్రభాకరరావు తటాలునవచ్చెను. మనోహరరావు వీరభద్రునకొకకుర్చీవేయించి కూర్చుండబెట్టెను. ప్రభాకరరావుకొక కుర్చీతెప్పించి దానిలోనతనిని గూర్చుండబెట్టెను. పరిశోధన కార్యాలయమునకొక నూతనతేజస్సు వచ్చెనని యెల్లరును గమనించిరి. ముగ్గురును పరిస్థితులను నన్యోన్యముగా దెలిసికొని, కర్తవ్యమును నిర్ధారణచేసికొని ఎవరేమిచేయవలయునో, నిర్దేశించుకొనిరి. వీరభద్రుడు అభివందనముచేసి వెడలి పోయెను. ప్రభాకరరావును మనోహరరావును అచ్చటనే గూర్చుండి రహస్యాలోచనములు సలుపుచుండిరి. పదినిమిషములు జరుగకపూర్వమే వీరభద్రుడును బరశురాముడును వచ్చి మనోహరరావు కభివందనముచేసిరి. మనోహరరావుకును బరశురామునకును నీక్రింది సంభాషణము జరిగెను.

"ఓయీ! నీవు పాండురంగని నెన్నినాళ్ళనుంచి యెఱుగుదువు."

"నేను పదియేనుసంవత్సరములక్రింద నతనిచేత జిక్కుబడితిని. నేను బయలుపడునుపాయములేక అతడు చెప్పినట్లు సేవచేయుచు నిర్బంధావాసము ననుభవించుచు గాలము పుచ్చితిని."

"ఈ యుత్తరమువ్రాసిన విజయలక్ష్మి యెన్నినాళ్ళ క్రిందట జిక్కుబడినది?"

"రమారమి రెండుమాసములయినది."

"ప్రభాకరరావునకు మిత్రుడగు రాఘవరావను నొక యువకుడు గనుపించుటలేదు. అతడును నచ్చటనే నిర్బంధింప బడియుండెనా ?"

"అవును. మేము మాగురమును నిర్బంధావాసమునుండి తప్పించుకొనవలయునని సర్వవిధముల బ్రయత్నించుచున్నాము మీసాహాయ్యములేక మేము క్షేమముగా బయలుపడజాల మని యాలోచించి, నిన్నటిదినమున లేఖవ్రాయించుకొని మీసన్నిధికి దీసికొనివచ్చితిమి."

"మంచిది. మేము బయలుదేరివచ్చెదము. దోషమును రూఢిచేసి ధ్రువపఱచకపూర్వము యింటగూర్చుండువానిని గాల్చివేయుటకు మాకధికారములేదు. వానినెట్లయినను నేను ఒకఉపాయముచేతఁ బట్టుకొని నిర్బంధింపవలయును. ఇందు లకు నీవేమియుపాయము చెప్పెదవు ?"

"రేపు ఒక్కనాఁడు మీరు నాకవకాశ మొసంగుడు. అందుకుదగిన ఏర్పాటులన్నియును విజయలక్ష్మిఅమ్మతో విచారించి నేనునిశ్చయించి, మఱునాఁటి యుదయముననే మీకు వార్తనుదెచ్చెదను."

"ఈ కార్యమునకు నెవ్వరుచేయించిరి ?"

"విజయలక్ష్మి యనుజ్ఞప్రకారము నేనేచేయించితిని."

"మీ నిర్బంధవిమోచనమునకును, నీయాశ్వమునకును నేమైన సంబంధమున్నదా ?"

"తప్పక గలదు. గేటుదియుత్తరములో విజయమ్మగారు మీకు సర్వమును దెలియపఱచగలరు ?"

"ఇప్పుడు మీకు సహాయముగ గొందఱి రక్షక భటులను బంపుమందువా ?"

"అట్లు చేయరాదు. కార్యభంగమగును. రేపుఉదయము వఱకు మీరు శాంతితోనుండుడు. మఱునాడు మీరచ్చటికి పదిమంది సాయుధులై వచ్చుటకు సిద్ధముగానుండుడు. ఇప్పటికి నాకు సెలవొసంగుడు."

"మంచిది. పోయిరమ్ము. తెల్లవారియుదయమున నీకై యెదురుచూచుచు నింటికడ గూర్చుండి యుందును."

"చిత్తము" అని పరశురాముఁడును వీరభద్రుడును వెడలిపోయిరి.

---

# 17. పక్షికి ఱెక్కలు తెగినవి

గుహామందిరమున బొండురంగడు విజయలక్ష్మితో నిట్లు సంభాషణసేయుచుండెను.

"దేవీ ! నీనియమముదీర్చుటకై మణిపేటికను దిరిగి సంపాదించితిని."

"మఱి దానిని తెఱచి, యంగుళీయకమును జూపవలదా ?

"అందులకై చాల ప్రయత్నించితిని. దానితెఱచు మార్గమెవ్వరికి దెలియదు. దానికొఱకు నీవు పట్టుబట్టి నన్ను వేసట పెట్టవలదు. ఇప్పుడు దీనిని నేనేబలాత్కారముగ దెఱచెదను. పేటిక కొంచెము మొఱ్ఱుక్కు-నోయినచో దానిని నేను సరిచేయించియిచ్చెదను. అందులకై నను సమ్మతిపుము."

"మంచిది. అట్లేచేయుము. అసాధ్య విషయమును సాధించుమని చెప్పుట న్యాయముకాదు. ఎట్లయినను నంగుళీయకము జూపినచో నేను దృప్తి పడియెదను."

ఆమె సమ్మతిని గ్రహించి పాండురంగడొక కన్నపు కత్తితో దానిని రెండుచెక్కలు చేసెను. దానిలోనున్న బంగారపు చేతిగడియారమును, అంగుళీయకమును బయటబడినవి. పాండురంగడా రెండింటిని విజయలక్ష్మిచేతి కొసంగి, "ఒక నియమమునుదీర్చితినిగదా ? అనెను.

విజయలక్ష్మి, మంచిది. ఇంక రెండవనియమమున్నది. ప్రభాకరుని సమ్మతి దెచ్చుటయో లేక ఆతని బరిమార్చి చూపుటయో గావలయును. నీవెట్లుచేసినను నేను నీదానను." అని ప్రత్యుత్తరమిచ్చెను.

పాం:—ఈకార్యము నాకవలెలగసాధకమగును. నావేగు వాడును పరశురాముడును ఈ కార్యమున నాకు దోడ్పడ గలరు. ఒకయువకుని జంపివేయుట మాకొక లెక్కలోని పని గాదు. ధైర్యముతో నుండుము. అనిచెప్పి విజయలక్ష్మినావలి కంపెను. విజయలక్ష్మి తన తావునకుబోయి పరశురాముని చెవిలో రహస్యముగ రెండువాక్యములుచెప్పెను. అంతలో పాండురంగడు వేగువానిని బరశురాముని సిద్ధముగ బిలపించు

కొని యాలోచనము నారంభించెను. ప్రభాకరరావు అను యువకుని నీవెఱుంగుదువా అని పరశురాము నడిగెను. ఎఱుంగుదునని యతఁ డుత్తరము చెప్పెను. అట్లయిన నీవుపోయి యతడు గ్రామములో నుండెనా? ఈనాటి రేయి రెండు జాములనఱకు అతడెచ్చటనుండును అతడెచ్చట పండును. ఈవిషయములు విచారను చేసికొని, నీవొక గంటలో రావలయును. అని పరశురామునకు ఉత్తరువొసంగెను. "చిత్తము దేవరా! ఇదే పోవుచున్నానని పరశురాముడు బయలుదేరి విజయలక్ష్మియొద్దకువచ్చి, ఒక్కనిమిషము కర్తవ్యమును గుఱించి యాలోచించి, వెంటనే భీమనగరమునకు జేరుకొనెను. తొలుత మనోహరరావును గలిసి రహస్యముగఁ గార్యక్రమమును దెల్పి క్షణకాలమున సెలవుదీసికొనిపోయెను. పాండురంగని కలిసి ప్రభాకరరావు నేటిరాత్రి తన పెద్దభవనములోని హాలులోఁ బండుకొని యుండునని చెప్పెను. అతడు తన యనుచరుల నందఱిని బిలిచి "నేటిరాత్రి భీమనగరము ప్రభాకరరావు నింటిలోజొచ్చి, ప్రభాకరరావు నిదురించు వేళ నతని తలగోసి తేవలయుననియాజ్ఞాపించెను. పరశురాముడు విజయలక్ష్మియొద్దకుబోయి మఱునాటి కర్తవ్యమును స్థిరముచేయుచుండెను.

మనోహరరావు పరశురాముని జూచిన తత్ క్షణమే వీరభద్రుని బిలిచి నేడొక పురుషవిగ్రహము మూడుగంటల వరకు సిద్ధము కావలెనని చెప్పెను. మధుసూదనరావుకు వ్రాసి ముప్పదిమంది సాయుధరక్షకభటులను అదనముగా దెప్పించెను. పరశురాముడుచెప్పినప్రకారము మనోహరరావు

సర్వసిద్ధము చేయించి సమయమున కెదురు చూచుచుండెను.

రాత్రి రెండుజాములు గడచెను. పాండురంగనిగొద్ద నున్న యిరువదిమంది చోరులసంఘమును ప్రభాకరరావు గృహమునకు నిశ్శబ్దముగ జేరిరి. పరశురాము దండతికం వెనుకనుండి "అదియే హాలు. అందఱును నొక్కసారి లోపలికి బోవలయునని చెప్పి హాలులో ప్రవేశింపజేసెను. నేను జెప్ప గనే ప్రభాకరరావు తలదీయుడని చెప్పెను. వారెల్లరును లోనికిబోయిన తరువాత త్వరచేయుడు. నిశ్శబ్దముగ నటకుడు అని సంజ్ఞచేసి యా భవనముయొక్క ద్వారమును మూసి అచ్చట వ్రేలాడుచున్న యొక గంటత్రాడును లాగెను. ద్వారమును గట్టిగా బంధించెను. చోరులందఱును నక్కడ నమర్చబడి నల్లని గుడ్డచే గప్పబడియున్న కొయ్యబొమ్మను ప్రభాకరరావుగా భావించిరి. ఒకడు మెడగట్టిగానొత్తిపట్టెను. చీకటిసమయమగుటచేతను, సందేమియు వెలుతురు లేకపో వుటచేతను ఈ మాయ నెవ్వరును గ్రహింపలేదు. మఱియొ కడు నోటిలో గుడ్డలుకుక్కెను. విగ్రహ మున్నటులేయుండెను. మఱియొకడు విగ్రహముయొక్క మెడమీద నొక్క వ్రేటు వేసి, తలభాగమును నీడదీసెను. ఒక్కబొట్టయినను రక్తము రాకుండుటచే నందఱును నచ్చెరువు నొందసాగిరి.

అంతలో నేబదిమంది రక్షకభటులు సాయుధులై వచ్చి భవనముచుట్టునుజుట్టి, తపాకుల్లనుజూపుచు నొక్కొక్క రినిగా బయటికి దీసి సంకెలలువేయుచు వేరువేరు చెఱసాల యరలలోని కంపి సర్బంధితుల జేసిరి.

పాండురంగని జట్టంతయు జిక్కినతరువాత, మనోహర రావు పరశురాముని బిలచుకొని ముందఱికర్తవ్య మడిగెను. పరశురాముడు రెండు నిమిషములలో గర్తవ్యమును విశదముగాఁజెప్పి శీఘ్రముగా గుహామందిరమునకుఁ జేరెను. పాండురంగడు పరశురాముడు కార్యము సాధించుకొని వచ్చెనని మహాసంతోషముతో నతనిం జేరి "కార్యవిజయ మైనదా? యని యడిగెను." అందులకు పరశురాముడు "నీయాజ్ఞకు వ్యతిరేకము జరుగగలదా? మనవారు ప్రభాకరరావు భవనమున బ్రవేశించి వానితల ఖండించి, యింటిని ముంగిటనున్న యొక చక్రాల కొయ్యగుర్రము గర్భమున బ్రభాకరరావు మృతకళేబరమును బెట్టి, అందఱును నందులో నెక్కి దానిని నడపుకొని వచ్చుచున్నార"ని చెప్పెను.

---

## 18. దొంగలగుహకు తాళము.

పాండురంగడీ సమాచారమును బరశురామునివలన వినినక్షణముననే విజయలక్ష్మిగదియొద్దకుబోయి మీసములు మెలివేయుచు "చూచితివా నాదెబ్బ? ప్రభాకరుని మృతకళేబరము గుర్రముమీఁద వచ్చుచున్నది."

విజ:—నీవంతటి శౌర్యశాలివని నేనెఱుంగుదును."

పాం:—ఇంకనీవు నన్నుజేపట్టుట కభ్యంతరమున్నదా?

విజ:—"మఱియే యభ్యంతరమును లేదు. ప్రభాకరుని మృతశరీరము నాకన్నుల బడినవెంటనే నేనునీకు స్వాధీను రాలనయ్యెదను."

అంతలో పరశురాముడు వారిచెంతకు జేరి "అయ్యా! గుఱ్ఱముచప్పుడు వినవచ్చుచున్నది." అని చెప్పెను.

విజయలక్ష్మి చేసిన కనుసంజ్ఞప్రకారము రాఘవరావు ఖడ్గహస్తుడై యొక చెంతనిలువబడి విజయలక్ష్మిని బాఱిపో నీయనివానివలె నటించుచు పాండురంగనికి నమస్కరించుచు నిలువంబడెను. పాండురంగడు సంతోషముపట్టలేక, విజయ లక్ష్మి యింక దన దేయని యుఱ్ఱటలాగుచు, నవ్వుచు నామె చీరకొంగుబట్టుకొని "ప్రియా! ఇంక నాకొకముద్దునిడుమని పైకివచ్చుచు 'నిర్బంధించుచుండెను." ఇంకను ప్రతిన నెఱవేఱలేదు. ప్రభాకరుని మృతకళేబరమును నేను చూడలేదు. అంతవఱకు నన్నంటరాకుమని తప్పుకొనుచు శీలరక్షణము సేసికొనుచుండెను. అంతలో కొయ్యగుఱ్ఱము గుహామందిరమునం బ్రవేశించెను. అదిగో గుర్రము. ప్రభా కరుని దెప్పించితినని విజయలక్ష్మి నిగ్గుచుండెను.

ఈ విషమపరిస్థితిలో గుర్రములోనుండి ఇరువదిమంది సాయుధరక్షకభటులు క్రిందకుఱికిరి. ఖడ్గహస్తుడైయున్న రాఘవరావు పాండురంగని కుడిచేతిమణికట్టుపై ఖడ్గమును దిగుగవేసి యొకదెబ్బకొట్టెను. పాండురంగడు నిరాయుధు డయ్యెను. రక్షకభటులు బిరపాకులెత్తి పాండురంగని జుట్టు ముట్టిరి. పాండురంగ డసహాయుడయ్యెను. వెంటనే మనో హరరావును ప్రభాకరరావును వానిరెక్కలుబట్టుకొని

చేతులకు సంకెలలువైచిరి. పాండురంగని తలపాగ దీసివైచిరి. అంగరక దీసివైచిరి. అతని యాభరణములను తొలగించిరి. కారాగృహ నిర్బంధితులుధరించు బట్టలు కట్టించిరి. కాళ్ళకు సైతము సంకెలలువైచిరి. అతనిని దీసికొని గుహామందిర మందున్న అన్ని చెఱగదులయొద్దకుఁ బోయి, యందున్న నిర్బంధితులనందఱును విడిపించిరి. మనోహరరావు శాసనము ప్రాకారము లోపలనున్న వారందఱును వెలుపలికివచ్చిరి. గుహాముఖద్వారము మూయబడి తాళముచే బిగింపబడెను. తాళముపైన లక్కతోఁ బ్రభుత్వసంబంధముగల ముద్ర వేయబడెను. దారుతురంగమున, విజయలక్ష్మి సమాధి చేసిరి. శేషించిన వారందఱితోడను సర్వముతోడను మనోహర రావు పరిశోధనకార్యాలయమునకుఁ జేరెను. కార్యాలయ మున నిలువబెట్టి మనోహరరావు అందఱివాఙ్మూలములను వ్రాసికొనెను. వీరభద్రుని బిలిపించి యతనివాఙ్మూలమును సైతము వ్రాసికొనెను.

మఱునాటియుదయమున లోగడబట్టుబడిన ఇరువది మంది చోరులను బాండురంగని నేరస్థులుగను, శేషించిన వారిని సాక్ష్యులుగను వివరించుచు సవిస్తరమగు కైఫియతును వ్రాసి హేలాపురమునగల న్యాయాధికారి రామమోహన రావు న్యాయసభకు బంపెను. నేరస్థులను సాక్ష్యులను మఱి కొందఱుబ్రజలను, నానందరావుకుమారుని సీతారాములును, హేలావతీ మహావీరులను నందఱిను హేలాపురి న్యాయసభకు దీసికొనిపోయి విచారణ పెట్టించెను.

---

# 19. హంతకునకు మృత్యుదేవతాహ్వానము

విచారణసభాదినమున, రామమోహనరావు న్యాయాధికార పీఠమునలంకరించియుండెను. ఇరువదిమంది చోరులును, చోరనాయకుడగు పాండురంగడును దోషులస్థానమున సంకెలలతో నిలువబడిరి. ప్రభుత్వపక్షమున నొక న్యాయవాదియుండెను. మనోహరరావు సాక్షుల నొక్కరొక్కరినిగా బిలచి వాఙ్మూలముల నిప్పించుచుండగా. న్యాయాధికారి వారిసమాధానములను స్వయముగా బత్రములపై వ్రాసికొనుచుండెను.

విజయలక్ష్మి తనయొద్ద నొక చిన్నపుస్తకమున పాండురంగని దినచర్య యంతయు గ్రమముగా వ్రాయబడియుండుటచే నాపుస్తకము సహాయ్యముచేత పాండురంగని క్రూరకార్యముల నన్నింటిని జెప్పుచు, నొకపెద్ద వాఙ్మూలమునిచ్చెను,

ఆవాఙ్మూలములోని యొక్కొక యంశమును దీసికొని ప్రభుత్వన్యాయవాది పాండురంగని. నతని భృత్యులను ఇది నిజమేనా మీరొప్పుకొనుచున్నారా యని అడుగజొచ్చెను. విజయలక్ష్మి చేతి పుస్తకమును, పగులగొట్టబడిన మణిపేటికయు, నందలి యుంగరమును, చేతిగడియారమును, కొయ్యగుఱ్ఱమును, నానందరావు మృతకళేబరమునుండి సంగ్రహించి దాచియుంచబడిన సొమ్ములును, నభియోగమునకు సంబంధించిన ఆస్తిగా బరిగణింపబడెను. పాండురంగడు మనోహరరావు పేరను, మనోహరరావునకును స్వహస్తమున వ్రాసిన లేఖలను న్యాయాధికారికి జూపబడెను. అభియోగమంతయు సత్యపూరితమైనదనియు, పాండురంగడు చోరనాయకుడనియు,

ఆతని భృత్యులందఱును దోషులనియును ధ్రువపఱచబడెను. న్యాయవాదులవాదము వినినతరువాత "మీరు నేరము చేసితిరా?" యని రామమోహనరావు పాండురంగాదులను ప్రశ్నించెను. అందఱును మేము నేరము చేసితిమని యొప్పుకొనిరి. న్యాయాధికారి పాండురంగనికి పదిసంవత్సరములు కఠినచెఱ ననుభవింపవలయుననియు, మిగిలినచోరు లొక్కొక్కఁడు, ఒక్కొక్క సంవత్సరమువఱకు కఠిననిర్బంధము ననుభవింపవలయుననియు శిక్ష వినిపించెను. పాండురంగని చోరులందఱును చెఱసాలలో జేరిరి. పాండురంగఁడు, దీర్ఘ నిర్బంధవాసము వినినవెంటనే, చేతుల సంకెలులను విదళించి పఱువిడి పాఱిపోవ యత్నించెను.

భవనవేదికను దాటుచున్నసమయమున పాండురంగనిపై రెండు తుపాకులు మనోహరరావు గాల్చెను. ప్రభాకరరావు మఱియొక తుపాకి గుండును పాండురంగనిమీదకు ప్రయోగించెను. పాండురంగనికి నెదురురొమ్మున నొకగుండు దాకెను. పాండురంగఁడు ఆదెబ్బదిని మూర్ఛపోయెను. రెండు నిమిసములలోఁ బాండురంగఁడు మేల్కాంచి, తుపాకిదెబ్బ దినుటవలన, ప్రాణములను త్యజించెను. శేషించినవారందరు దమ తమ యిండ్లకుబోయిరి.

తరువాత మనోహరరావు ధైర్యసాహసములకు మెచ్చి ప్రభుత్వము వారతనికి గొప్పబహుమానమునిచ్చి, యతనిని మాండలికపరిశోధన శాఖాధికారినిగా జేసిరి. ప్రభాకరరావు సర్వసమ్మతితో విజయలక్ష్మిని వివాహము జేసికొని చిరకాలము సౌఖ్యముల ననుభవించెను.